శ్రీః

# బాలరామాయణము

## టీకాతాత్పర్యసహితము

వ్యాఖ్యాత :

శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు



ప్రకాశకులు

**రావి మోహనరావు,** M.Sc., M.A. (Sanskrit)

510, Pride Block Platinum County, Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State

శ్రీః

# బాలరామాయణము

**టీకాతాత్పర్యసహితము**

**వ్యాఖ్యాత : శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు**


ప్రథమముద్రణ : శ్రీకృష్ణజయన్తి - 2021

ప్రతులు : 500

పుటలు : 56

వెల రూ. : అమూల్యం





ప్రతులు దొరుకుచోటు

**R. Mohan Rao,** M.Sc., M.A. (Sanskrit)
510, Pride Block Platinum County,
Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State

ముద్రణ :

కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాద్

శ్రీ

# బాలరామాయణము

## బాలకాండము

**తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,**
**నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్.** **1**

**ప్ర.** తపస్స్వాధ్యాయనిరతం – తపః = తపస్సునందును, స్వాధ్యాయ = వేదాధ్యయనమునందును, నిరతమ్ = మిక్కిలి ఆసక్తిగల వాడును, వాగ్విదామ్ = విద్వాంసులలో, వరమ్ = శ్రేష్ఠుడును, ముని పుంగవమ్ = మునిశ్రేష్ఠుడును అగు, నారదమ్ = నారదమహర్షిని, తపస్వీ = తపస్సంపన్నుడగు, వాల్మీకిః = వాల్మీకిమహర్షి, పరిపప్రచ్ఛ = భక్తిపూర్వకముగా (ఇట్లు) అడిగెను.

**తా.** తపస్సంపన్నుడు, వేదాధ్యయనతత్పరుడు, పండితులలో గొప్పవాడు , మునులలో శ్రేష్ఠుడగు నారదమహర్షిని తపశ్శాలియగు వాల్మీకి భక్తితో ఇట్లు ప్రశ్నించెను.

**కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్,**
**ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః.** **2**

**ప్ర.** సాంప్రతమ్ = ఇప్పుడు, అస్మిన్ లోకే = ఈ లోకమందు, కః = ఎవడు, గుణవాన్ ను = గుణవంతుడు? కః చ = ఎవడు, వీర్యవాన్ = పరాక్రమవంతుడు? ధర్మజ్ఞః చ = ధర్మ మెఱిగినవాడును, కృతజ్ఞః చ = తనకు చేయబడిన మేలు తలచుకొనువాడును,

సత్యవాక్యః = నిజము పలుకువాడును, దృఢవ్రతః = సడలని నియమము కలవాడును (కః = ఎవడు?).

**తా.** నారదమునీంద్రా! ఇపు డీ లోకమున మంచి గుణములు కలవాడు, పరాక్రమముతో విలసిల్లువాడు, ధర్మ మెఱిగినవాడు, పరులు తన కొనరించిన మేలు తలంచువాడు, నిజమే పలుకువాడు, దృఢమగు సంకల్పము కలవాడు ఎవడు?

**చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః,**
**విద్వాన్ కః క స్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః. 3**

**ప్ర.** చారిత్రేణ చ= సదాచారముతో, యుక్తః = కూడినవాడు, కః = ఎవడు? సర్వభూతేషు = సకలప్రాణులయందును, హితః = మేలు చేకూర్చువాడు, కః = ఎవడు? విద్వాన్ = సకల శాస్త్రముల నెఱిగినవాడు, కః = ఎవడు? సమర్థః చ = (సకలకర్తవ్యములందును) కుశలుడును, కః = ఎవడు?, ఏకప్రియదర్శనః – ఏక = ఒకే, ప్రియ = ప్రీతిని కలిగించు, దర్శనః = సాక్షాత్కారము కలవాడు, కః చ = ఎవడు?

**తా.** చక్కని ఆచారము కలవాడు, సకలజీవులకు మేలొన గూర్చువాడు, సకలశాస్త్రముల నెఱిగినవాడు, తా నాచరింపదగిన పనులను నేర్పుతో అనుష్ఠించువాడు, ఎల్లరకును ఎల్లపుడు ఆహ్లాదమునే కలిగించు రూపముతో దర్శన మిచ్చువాడును ఎవడు?

**ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కోऽనసూయకః,**
**కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే. 4**

**ప్ర.** ఆత్మవాన్ = ధైర్యము కలవాడు, కః = ఎవడు? జితక్రోధః = జయింపబడిన కోపము కలవాడు, ద్యుతిమాన్ = కాంతిమంతుడు, అనసూయకః = ఇతరుల గుణములందు దోషములను చూపనట్టి వాడును, కః = ఎవడు? సంయుగే = యుద్ధమునందు, జాతరోషస్య = కోపించిన, కస్య = ఎవనికి, దేవాః చ = దేవతలును, బిభ్యతి = భీతిల్లుదురో.

**తా.** మిక్కిలి ధైర్యశాలి, కోపమును జయించినవాడు, కాంతిమంతుడు, అసూయ లేనివాడును ఎవడు? యుద్ధమున కోపించిన ఎవనిని చూచి దేవతలును భీతిల్లుదురో (అట్టి మహాపురుషు డెవ్వడు?)

**ఏత దిచ్ఛా మ్యహం శ్రోతుం పరం కౌతూహలం హి మే,**
**మహర్షే! త్వం సమర్థోఽసి జ్ఞాతు మేవంవిధం నరమ్. 5**

**ప్ర.** మహర్షే! = ఓ మహర్షీ! అహం = నేను, ఏతత్ = దీనిని, శ్రోతుమ్ = వినుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను. మే = నాకు, పరమ్ = మిక్కిలి, కౌతూహలం హి = వేడుక కలుగుచున్నదికదా! త్వమ్ = నీవు, ఏవంవిధమ్ = ఇటువంటి, నరమ్ = మనుజుని, జ్ఞాతుమ్ = తెలిసికొనుటకు, సమర్థః అసి = సమర్థుడవు.

**తా.** ఓ మహర్షీ! నే నీ విషయము వినగోరుచున్నాను. అట్లు వినవలెనని నాకు మిక్కిలి అభిలాష కలుగుచున్నది. నీ విట్టి నరుడెవ్వడో తెలిసికొనజాలినవాడవు.

**శ్రుత్వా చైతత్ త్రిలోకజ్ఞో వాల్మీకే ర్నారదో వచః,**
**శ్రూయతా మితి చామంత్ర్య ప్రహృష్టో వాక్య మబ్రవీత్. 6**

**ప్ర.** త్రిలోకజ్ఞః = ముల్లోకముల నెఱిగిన, నారదః = నారదమహర్షి, వాల్మీకేః = వాల్మీకియొక్క, ఏతత్ = ఈ, వచః = మాటను, శ్రుత్వా = విని, ప్రహృష్టః = ఆనందించినవాడై, శ్రూయతామ్ = వినబడుగాక (వినుము), ఇతి = అని, ఆమంత్ర్య = పిలిచి, వాక్యమ్ = (ఈ) మాటను, అబ్రవీత్ = పలికెను.

**తా.** ముల్లోకముల నెఱిగిన నారదమహర్షి వాల్మీకివచన మాలించి, తానేది చెప్పదలంచెనో దానినే వాల్మీకియు అడిగెనని సంతసించి, 'ఇదిగో విను' మని యాతని నభిముఖు నొనరించుకొని యిట్లు పలికెను.

**బహవో దుర్లభాశ్చైవ యే త్వయా కీర్తితా గుణాః,**
**మునే వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తః శ్రూయతాం నరః. 7**

**ప్ర.** మునే = ఓ వాల్మీకిమహర్షీ! యే = ఏ, గుణాః = పరాక్రమాది గుణములు, త్వయా = నీచే, కీర్తితాః = పేర్కొనబడినవో (అవి), బహవః = అనేకములు, దుర్లభాః = పొందశక్యముగానివియు. అహం = నేను, బుద్ధ్వా = ఆలోచన చేసి, వక్ష్యామి = చెప్పెదను. తైః = అట్టి గుణములతో, యుక్తః = కూడినట్టి, నరః = మనుజుడు, శ్రూయతామ్ = వినబడుగాక.

**తా.** ఓ వాల్మీకిమహర్షీ! నీవు వర్ణించిన గుణములు విపులమైనవి. అంతేకాదు. అవి పరమపురుషునియందు తక్క అన్యులం దగపడనివి. నే నొకింత యోచించి తెలిపెదను. ఆ సమస్తగుణములతో అలరారు నరు డెవ్వడో వినుము.

**ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః,**
**నియతాత్మా మహావీర్యో ద్యుతిమాన్ ధృతిమాన్ వశీ. 8**

**ప్ర.** ఇక్ష్వాకువంశప్రభవః = ఇక్ష్వాకువంశమున పుట్టినవాడు, రామః నామ = రాముడని, జనైః = ప్రజలచే, శ్రుతః = వినబడిన వాడు, నియతాత్మా = నిలుకడ కల మనస్సు కలవాడు, మహావీర్యః = గొప్పసామర్థ్యము కలవాడు, ద్యుతిమాన్ = కాంతిమంతుడు, ధృతిమాన్ = ధైర్యశాలి, వశీ = జితేంద్రియుడు.

**తా.** అత డిక్ష్వాకు వంశమున పుట్టినవాడు. జను లతనిని 'రాము' డని పిలుతురు. అతని మనస్సు నిలుకడ కలది. పరాక్రమము గొప్పది. అతడు మిక్కిలి తేజస్వి, ధైర్యవంతుడు, జితేంద్రియుడును.

**బుద్ధిమాన్ నీతిమాన్ వాగ్మీ శ్రీమాన్ శత్రునిబర్హణః,**
**విపులాంసో మహాబాహుః కంబుగ్రీవో మహాహనుః. 9**

**ప్ర.** బుద్ధిమాన్ = ప్రశస్తమైన బుద్ధి కలవాడు, నీతిమాన్ = గొప్ప నీతి కలవాడు, వాగ్మీ = చక్కగ మాటలాడువాడు, శ్రీమాన్ = గొప్ప సంపద కలవాడు, శత్రునిబర్హణః – శత్రు = శత్రువులను, నిబర్హణః = నశింపజేయువాడు, విపులాంసః = విస్తారమైన మూపు కలవాడు, మహాబాహుః = గొప్పభుజములు గలవాడు, కంబుగ్రీవః = శంఖము వంటి మెడ కలవాడు, మహాహనుః = గొప్ప చెక్కిళ్ళ పైభాగము కలవాడు.

**తా.** అతడు ప్రశస్తమైన తెలివి కలవాడు, ఉత్తమమైన నీతి కలవాడు, చక్కగ మాటలాడువాడు, సర్వోత్కృష్టమగు సంపద కలవాడు.

శత్రువుల ను చెండాడువాడు, విస్తారమైన మూపు, బలిష్ఠములై పొడవైన చేతులు, శంఖమువంటి మెడ, గొప్ప హనువు కలవాడు.

**మహోరస్కో మహేష్వాసో గూఢజత్రు రరిందమః,**
**ఆజానుబాహు స్సుశిరాః సులలాటః సువిక్రమః. 10**

**ప్ర.** మహోరస్కః = విశాలమైన ఱొమ్ము కలవాడు, మహేష్వాసః = గొప్ప విల్లు కలవాడు, గూఢజత్రుః = కనిపించని మూపునందలి సంధియెముకలు కలవాడు, అరిందమః = అంతఃశత్రువులను బహిశ్శత్రువులను అణచువాడు, ఆజానుబాహుః = మోకాళ్ళను తాకు పొడవైన చేతులు కలవాడు, సుశిరాః = (చక్రవర్తి లక్షణోపేతమగు) చక్కని తల కలవాడు, సులలాటః = విశాలమైన నుదురు కలవాడు, సువిక్రమః = చక్కని నడక కలవాడు.

**తా.** అతడు విశాలమైన వక్షఃస్థలము కలవాడు. గొప్ప విల్లు కలవాడు, కనుపించని మూపునందలి సంధి యెముకలు కలవాడు. లోపలి, వెలుపలి శత్రువుల నణచువాడు, మోకాళ్ళను తాకు పొడవైన భుజములు కలవాడు, చక్రవర్తి లక్షణోపేతమగు చక్కని శిరము కలవాడు, విశాలమైన నుదురుతో నొప్పువాడు, ఏనుగువలె చక్కగా నడచువాడు.

**సమః సమవిభక్తాంగః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్,**
**పీనవక్షా విశాలాక్షో లక్ష్మీవాన్ శుభలక్షణః. 11**

**ప్ర.** సమః = సమమగు ఎత్తు కలవాడు, సమవిభక్తాంగః = సమముగా విభజింపబడిన అవయవములు కలవాడు, స్నిగ్ధవర్ణః =

నిగనిగలాడు శరీరవర్ణము కలవాడు, ప్రతాపవాన్ = గొప్పతేజము కలవాడు, పీనవక్షాః = బలిసిన ఱొమ్ము కలవాడు, విశాలాక్షః = విప్పారిన కన్నులు కలవాడు, లక్ష్మీవాన్ = (అవయవ) సౌందర్యము కలవాడు. శుభలక్షణః = శుభచిహ్నములు కలవాడు.

**తా.** అతడు మిక్కిలి పొడగరి లేదా – మిక్కిలి పొట్టివాడును గాక సముడు. హెచ్చుతగ్గులు లేక సమముగ విభజింపబడిన అవయవముల పొంకము కలవాడు. నిగనిగలాడు శరీరవర్ణము కలవాడు. మిక్కిలి తేజస్సు కలవాడు. పరిపుష్టమైన ఱొమ్ము కలవాడు. సర్వావయవసౌందర్యము కలవాడు. ఇట్టి మిగిలిన సకల శుభలక్షణములు కలవాడు.

**ధర్మజ్ఞః సత్యసంధశ్చ ప్రజానాం చ హితే రతః,**
**యశస్వీ జ్ఞానసంపన్నః శుచి ర్వశ్యః సమాధిమాన్. 12**

**ప్ర.** ధర్మజ్ఞః = ధర్మ మెఱిగినవాడు, సత్యసంధః చ = సత్యమైన ప్రతిజ్ఞ కలవాడు, ప్రజానాం = జనులయొక్క, హితే = మేలు కలిగించుటయందు, రతః చ = ఆసక్తుడును, యశస్వీ = కీర్తి కలవాడు, జ్ఞాన సంపన్నః = జ్ఞానము కలవాడు, శుచిః = పరిశుద్ధుడు, వశ్యః = ఆశ్రితులకు వశమం దుండువాడు, సమాధిమాన్ = ఏకాగ్రత కలవాడు.

**తా.** శరణాగత రక్షణము మున్నగు ధర్మ మెఱిగినవాడు, ప్రతిజ్ఞ తప్పనివాడు, ప్రజలకు మేలు చేయుటయం దాసక్తుడు, ఆశ్రితరక్షకుడను కీర్తి గలవాడు, అన్ని విషయములు తెలిసినవాడు, పరిశుద్ధుడు, ఆశ్రితుల వశమం దుండువాడు, ఆశ్రితరక్షణమే ధ్యేయముగ కలవాడు.

**ప్రజాపతిసమః శ్రీమాన్ ధాతా రిపునిషూదనః,**
**రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా. 13**

**ప్ర.** ప్రజాపతిసమః = బ్రహ్మతో సమానుడు, శ్రీమాన్ = అఖండైశ్వర్యసంపన్నుడు, ధాతా = పోషించువాడు, రిపునిషూదనః = శత్రువులను నాశనముచేయువాడు, జీవలోకస్య = ప్రాణి సమూహమునకు, రక్షితా = రక్షకుడు, ధర్మస్య = ధర్మమునకు, పరిరక్షితా = సంరక్షకుడు.

**తా.** బ్రహ్మతో సమానుడు, అఖండైశ్వర్యసంపన్నుడు, సకల చరాచర జగత్తును పోషించువాడు. శత్రువులను పరిమార్చువాడు, సకల ప్రాణికోటిని కాపాడువాడు, విశేషించి ధర్మమును రక్షించువాడు.

**రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా,**
**వేదవేదాంగతత్త్వజ్ఞో ధనుర్వేదే చ నిష్ఠితః. 14**

**ప్ర.** స్వస్య = తనదగు, ధర్మస్య = ధర్మమునకు, రక్షితా = రక్షించువాడు, స్వజనస్య చ = తన సన్నిహితులకును, రక్షితా = రక్షకుడు, వేదవేదాంగతత్త్వజ్ఞః = వేదముల యొక్కయు, వేదాంగముల యొక్కయు స్వరూప మెఱిగినవాడు, ధనుర్వేదే చ = విలువిద్య యందును, నిష్ఠితః = నిష్ణాతుడు.

**తా.** లోకమున ధర్మమును ప్రతిష్ఠించుటే కాక, తన ధర్మము తాను ఆచరించుటచే దానిని రక్షించువాడు, ప్రజలను రక్షించు లక్ష్యముతో తన సన్నిహితులను నిర్లక్ష్యము చేయక వారినిగూడ కాపాడువాడు, ఋగ్–యజుష్–సామ–అథర్వములను నాల్గు వేదముల యొక్కయు, శిక్షా–వ్యాకరణ–ఛందో–జ్యోతిష–నిరుక్త–కల్పములను ఆఱు

వేదాంగములయొక్కయు స్వరూప మెఱిగినవాడు. ధనుర్వేదమున (అస్త్ర–శస్త్ర ప్రయోగమును తెలుపు విద్యలో) నిష్ణాతుడు.

**సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః స్మృతిమాన్ ప్రతిభానవాన్,**
**సర్వలోకప్రియః సాధు రదీనాత్మా విచక్షణః. 15**

**ప్ర.** సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞః = సకలశాస్త్రములందలి విషయముల స్వరూప మెఱిగినవాడు, స్మృతిమాన్ = ఎఱిగిన విషయములు మఱువనివాడు, ప్రతిభానవాన్ = ప్రతిభ కలవాడు, సర్వలోకప్రియః = సకల జనులకు ప్రీతిపాత్రుడు, సాధుః = సజ్జనుడు, అదీనాత్మా = కలతనొందని మనస్సు కలవాడు, విచక్షణః = వివిధవిషయములు తేటతెల్లముగా చెప్పువాడు.

**తా.** అన్ని శాస్త్రములు పఠించుటే గాక వాని యర్థము కూలంకషముగా తెలిసినవాడు, పూర్వ మెఱిగిన విషయములు మఱువనివాడు, ప్రతిభాశాలి, జనులెల్లరకు ప్రీతిపాత్రుడు, సజ్జనుడు, కలత నొందని మనస్సు కలవాడు, వివిధ విషయములు తేటతెల్లముగ చెప్పువాడు.

**సర్వదాభిగతః సద్భిః సముద్ర ఇవ సింధుభిః,**
**ఆర్య స్సర్వసమశ్చైవ సదైకప్రియదర్శనః. 16**

**ప్ర.** సర్వదా = ఎల్లప్పుడు, సముద్రః = సముద్రము, సింధుభిః ఇవ = నదులచే వలె, సద్భిః = సత్పురుషులచే, అభిగతః = కూడినవాడు, ఆర్యః = పూజ్యుడు, సర్వసమః చ ఏవ = అందఱను సమముగా చూచువాడు, సదా = ఎల్లప్పుడు, ఏకప్రియదర్శనః = మిక్కిలి ప్రీతి గొల్పు దర్శన మిచ్చువాడు.

**తా.** ఎల్లప్పుడు సముద్రము నదులచే సేవించబడినట్లు, సజ్జనులచే పరివేష్టితుడై యుండువాడు, పూజనీయుడు, శత్రు- మిత్ర- ఉదాసీనులయందు సమబుద్ధి కలవాడు, సదా ఎంత దర్శించినను తనివి తీఱని ఆశ్చర్యము గొల్పు దర్శన మిచ్చువాడు.

**స చ సర్వగుణోపేతః కౌసల్యానందవర్ధనః,**
**సముద్ర ఇవ గాంభీర్యే ధైర్యేణ హిమవా నివ. 17**

**ప్ర.** సః చ = అతడు, సర్వగుణోపేతః = సకలసద్గుణములతో కూడినవాడు, కౌసల్యానందవర్ధనః = కౌసల్య ఆనందమును పెంపొందజేయువాడు, గాంభీర్యే = గాంభీర్యమున, సముద్రః ఇవ = సముద్రమువలె, ధైర్యేణ = నిశ్చలతచే, హిమవాన్ ఇవ = హిమవత్పర్వతమువలె (ఉన్నవాడు).

**తా.** అతడు సకల సద్గుణ సమన్వితుడు. కౌసల్యాదేవి ఆనందమును పెంపొందజేయు తనయుడు. గాంభీర్యమున సముద్రము వంటివాడు. ధైర్యమున హిమవంతునితో సమానుడు.

**విష్ణునా సదృశో వీర్యే సోమవత్ ప్రియదర్శనః,**
**కాలాగ్నిసదృశః క్రోధే క్షమయా పృథివీసమః, 18**
**ధనదేన సమస్త్యాగే సత్యే ధర్మ ఇవాపరః.**

**ప్ర.** వీర్యే = పరాక్రమమందు, విష్ణునా = విష్ణువుతో, సదృశః = సమానుడు. సోమవత్ = చంద్రునివలె, ప్రియదర్శనః = ఆహ్లాదకరమగు దర్శనము కలవాడు, క్రోధే = కోపమందు, కాలాగ్నిసదృశః = ప్రళయాగ్నితో సమానుడు, క్షమయా = ఓర్పుచే,

పృథివీసమః = భూమితో సమానుడు, త్యాగే = దానము చేయుట యందు, ధనదేన = కుబేరునితో, సమః = సమానుడు, సత్యే = నిజము పలుకుటలో, అపరః = వేరొక, ధర్మః ఇవ = ధర్మ దేవత వంటి వాడు.

**తా.** అతడు పరాక్రమమున విష్ణువుతో సమానుడు. చంద్రునివలె ఆహ్లాదకరమగు దర్శన మొసగువాడు. కోపము వచ్చినచో ప్రళయాగ్నిని పోలువాడు. సహనమున భూమిని పోలినవాడు. దానమున కుబేరు నంతటివాడు. సత్యము పలుకుటలో ధర్మదేవతతో సమానుడు.

బాలకాండము సమాప్తము

# అయోధ్యాకాండము

**త మేవంగుణసంపన్నం రామం సత్యపరాక్రమమ్, 19**
**జ్యేష్ఠం శ్రేష్ఠగుణై ర్యుక్త ప్రియం దశరథ స్సుతమ్,**
**ప్రకృతీనాం హితై ర్యుక్తం ప్రకృతిప్రియకామ్యయా, 20**
**యౌవరాజ్యేన సంయోక్తుమైచ్ఛత్ ప్రీత్యా మహీపతిః.**

**ప్ర.** మహీపతిః = రాజగు దశరథుడు, తమ్ = అట్లు ప్రసిద్ధుడును, ఏవంగుణసంపన్నమ్ = ముందు చెప్పబడిన గుణములు కోకొల్లలుగ కలవాడును, సత్యపరాక్రమమ్ = విఫలముగాని పరాక్రమము కలవాడును, జ్యేష్ఠమ్ = మొదట పుట్టినవాడును, శ్రేష్ఠగుణైః = నీతిశాస్త్రమున చెప్పబడిన ఆఱు గుణములతో, యుక్తమ్ = కూడినవాడును, ప్రియమ్ = ప్రీతిపాత్రుడును, సుతమ్ = కుమారుడగుటచే రాజ్యార్హుడును, ప్రకృతీనామ్ = ప్రజలకు, హితైః = మేలు కలుగు పనులతో, యుక్తమ్ = కూడినవాడును అగు, రామమ్ = రాముని, ప్రకృతిప్రియకామ్యయా–ప్రకృతి = ప్రజలకు, ప్రియ = ప్రీతికలిగించవలెనను, కామ్యయా = కోరికతో, ప్రీత్యా = తనకును ప్రీతితో, యౌవరాజ్యేన = యువరాజుగా, సంయోక్తుమ్ = కూర్చుటకు, ఐచ్ఛత్ = కోరెను.

**తా.** దశరథమహారాజు తన ప్రజలకు, తనకును ప్రియ మొనరించు కోరికతో పూర్వోక్త కల్యాణగుణ సంపన్నుడు, అమోఘ మగు విక్రమము కలవాడు, పెద్దకుమారుడు, నీతిశాస్త్రమున పేర్కొనబడిన సంధి–విగ్రహ–యాన–ఆసన–ద్వైధీభావ–సమాశ్రయములను ఉత్తమ

గుణము లారింటిలో కూడినవాడు, ప్రీతిపాత్రుడు, ప్రజలకు మేలొనగూర్చువాడగు రాముని యువరాజు ను చేయ దలంచెను.

**తస్యాభిషేకసంభారావ్ దృష్ట్వా భార్యాఽథ కైకయీ, 21**
**పూర్వం దత్తవరా దేవీ వర మేన మయాచత,**
**వివాసనం చ రామస్య భరత స్యాభిషేచనమ్. 22**

**ప్ర.** అథ = పిమ్మట, తస్య = రామునియొక్క, అభిషేకసంభారాన్ = పట్టాభిషేకసామాగ్రిని, దృష్ట్వా = చూచి (మంథరవలన కనుగొని) భార్యా = భార్యయు, పూర్వమ్ = వెనుక, దత్తవరా = (దశరథునిచే) ఈయబడిన వరముకలదియు అగు, దేవీ = కైక, ఏనమ్ = ఈ దశరథుని, రామస్య = రామునియొక్క, వివాసనమ్ = వెడలగొట్టుటను, భరతస్య = భరతునియొక్క, అభిషేచనమ్ = పట్టాభిషేకమును అను, వరం = వర(ద్వయ)మును, అయాచత = కోరెను.

**తా.** అంతట పూర్వము దశరథునివలన వరములను పొందిన అతని ప్రియసతి కైక, రాముని యౌవరాజ్యాభిషేకమునకై తేబడుచున్న ఉపకరణములను గాంచి, వెంటనే రాము నడవి కంపుట, భరతుని యౌవరాజ్యాభిషిక్తుని జేయుట అను వరము లిమ్మని దశరథుని ప్రార్థించెను.

**స సత్యవచనా ద్రాజా ధర్మపాశేన సంయతః,**
**వివాసయామాస సుతం రామం దశరథః ప్రియమ్. 23**

**ప్ర.** సః = అట్టి, రాజా దశరథః = దశరథమహారాజు, ధర్మపాశేన = ధర్మ మను త్రాటిచే, సంయతః = బంధింపబడినవాడై, సత్యవచనాత్

= సత్యము పలుకువాడు అగుటవలన, ప్రియమ్ = ఇష్టుడగు, సుతమ్ = కుమారుని, వివాసయామాస = వెడలనంపెను.

**తా.** దశరథుడును సత్యసంధు డగుటవలన ధర్మమను త్రాటితో కట్టబడినవాడై తప్పక తన మాట తన ప్రియపుత్రుడగు రాముని వనమున కంపెను.

**స జగామ వనం వీరః ప్రతిజ్ఞామనుపాలయన్,**
**పితు ర్వచననిర్దేశాత్ కైకేయ్యాః ప్రియకారణాత్. 24**

**ప్ర.** సః = ఆ రాముడు, వీరః = పరాక్రమశాలి (రాజ్యపాలన సమర్థుడు) అయ్యును, కైకేయ్యాః = కైకకు, ప్రియకారణాత్ = ప్రీతికి కారణమైన, పితుః = తండ్రియగు దశరథునియొక్క, వచననిర్దేశాత్ = ఆజ్ఞ వలన, ప్రతిజ్ఞామ్ = (కైక ఎదుట చేసిన) ప్రతిజ్ఞను, అనుపాలయన్ = రక్షించుచు, వనం = అడవికి, జగామ = పోయెను.

**తా.** రాముడు వీరుడగుటచే రాజ్యపాలనసమర్థు డైనను, కైకేయికి ప్రీతి కలిగించుటకును, తండ్రియాజ్ఞ పాలించుటకును తాను కైక ఎదుట తండ్రియాజ్ఞ పాటింతునని చేసిన ప్రతిజ్ఞను నిలుపు కొనుచున్నవాడై యడవి కేగెను.

**తం వ్రజంతం ప్రియో భ్రాతా లక్ష్మణోఽనుజగామ హ,**
**స్నేహా ద్వినయసంపన్నః సుమిత్రానందవర్ధనః, 25**
**భ్రాతరం దయితో భ్రాతుః సౌభ్రాత్ర మనుదర్శయన్.**

**ప్ర.** ప్రియః = (రామునియందు) ప్రీతి కల, భ్రాతా = సోదరుడు, వినయసంపన్నః = (సేవకు కారణమైన) వినయముతో నొప్పువాడు,

సుమిత్రానందవర్ధనః = సుమిత్రయొక్క ఆనందమును వృద్ధి నందించువాడు, భ్రాతుః = అన్నయగు రామునకు, దయితః = ఇష్టుడగు, లక్ష్మణః = లక్ష్మణుడు, సౌభ్రాత్రమ్ = చక్కని సోదరు డగుటను, అనుదర్శయన్ = ప్రదర్శించుచు, వ్రజంతమ్ = పోవుచున్న, తమ్ = రాముని, అనుజగామ = అనుసరించెను; హ = ఆశ్చర్యము!

**తా.** అట్లు వెడలుచున్న అన్నను వినయసంపద కలవాడును, సుమిత్ర ఆనందమును పెంపొందించువాడును, ప్రియభ్రాతయును, అన్నకు ప్రీతి పాత్రుడును అగు లక్ష్మణుడు తన ఉత్తమ సోదర భావమును జనులకు ప్రదర్శించుచు అనుసరించెను.

**రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమా హితా, 26**
**జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా,**
**సర్వలక్షణసంపన్నా నారీణా ముత్తమా వధూః, 27**
**సీతాప్యనుగతా రామం శశినం రోహిణీ యథా.**

**ప్ర.** రామస్య = రామునకు, దయితా = ప్రియమైనది, నిత్యమ్ = సదా, భార్యా = మనస్సునందు ధరింపదగినది, ప్రాణసమా = ప్రాణమునకు సాటియైనది, హితా = ఎల్లజీవులకు మేలు చేకూర్చునది, జనకస్య = జనకుని యొక్క, కులే = వంశమున, జాతా = జన్మించినది, నిర్మితా = (అమృతమును చిలికిన పిమ్మట రాక్షసులను మోహింపజేయుటకు) సృజించబడిన, దేవమాయా ఇవ = విష్ణువు యొక్క మాయవలె నున్నది, సర్వలక్షణసంపన్నా = (సాముద్రిక శాస్త్రమున చెప్పబడిన) ఉత్తమస్త్రీలక్షణములన్నియు కలది, నారీణామ్ = స్త్రీలలో, ఉత్తమా = శ్రేష్ఠురాలు, వధూః = దశరథుని కోడలు

అగు, సీతా అపి = సీతయు, శశినమ్ = చంద్రుని, రోహిణీ యథా = రోహిణివలె, రామమ్ = రాముని, అనుగతా = అనుసరించెను.

**తా.** రాముని ప్రియభార్య, ప్రాణముతో సమానురాలు, సదా పతిహితము కోరునది, జనకుని వంశమందు పుట్టినది, సృష్టింపబడిన దేవమాయవలె నొప్పునది, సమస్తమైన ఉత్తమస్త్రీ లక్షణములు కలది, స్త్రీలలో అత్యుత్తమవనిత అగు సీత చంద్రుని రోహిణి వలె పతి ననుసరించెను.

**పౌరై రనుగతో దూరం పిత్రా దశరథేన చ. 28**

**ప్ర.** పౌరైః = పురజనులచేతను, పిత్రా = తండ్రియగు, దశరథేన చ = దశరథునిచేతనుకూడ, దూరం = చాలదూరము, అనుగతః = అనుసరింపబడెను.

**తా.** పురజనులు, తండ్రియగు దశరథుడును చాల దూరము రాము ననుసరించిరి.

**శృంగిబేరపురే సూతం గంగాకూలే వ్యసర్జయత్,**
**గుహ మాసాద్య ధర్మాత్మా నిషాదాధిపతిం ప్రియమ్, 29**
**గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా.**

**ప్ర.** ధర్మాత్మా = (ఆశ్రితవాత్సల్యము, సౌశీల్యము అను) ధర్మములు స్వభావముగ కలవాడగు రాముడు, శృంగిబేరపురే = శృంగిబేరపురమందు, నిషాద+అధిపతిమ్ = నిషాదులకు రాజగు, ప్రియమ్ = తనయందు ప్రీతికలవాడగు, గుహమ్ = గుహుని, ఆసాద్య = సమీపించి, గుహేన = గుహునితో, అక్ష్మణేన = లక్ష్మణునితో,

సీతయా చ = సీతతోను, సహితః = కూడినవాడై, సూతమ్ = సారథియగు సుమంత్రుని, గంగాకూలే = గంగయొద్దున, వ్యసర్జయత్ = విడిచిపెట్టెను.

**తా.** పిమ్మట ధర్మాత్ముడగు రాముడు శృంగిబేరపురమున బోయ వారికి ప్రభువగు ప్రీతిపాత్రుడైన గుహుని చేరి, యాతనితో, లక్ష్మణునితో, సీతతో కూడినవాడై సారథి యగు సుమంత్రుని పోయి రమ్మని గంగానది యొద్దున విడిచి పెట్టెను.

**తేవనేన వనం గత్వా నదీ స్తీర్త్వా బహూదకాః, 30**
**చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్,**
**రమ్య మావసథం కృత్వా రమమాణా వనే త్రయః, 31**
**దేవగంధర్వసంకాశాః తత్ర తే న్యవసన్ సుఖమ్.**

**ప్ర.** తే త్రయః = ఆ సీతారామలక్ష్మణులు ముువ్వురును, తేవనేన = కాలినడకనే, వనమ్ = అడవికి, గత్వా = పోయి, బహూదకాః = సమృద్ధిగ నీరు కల, నదీః = నదులను, తీర్త్వా = దాటి, భరద్వాజస్య = భరద్వాజమహర్షియొక్క, శాసనాత్ = ఆజ్ఞవలన, చిత్రకూటమ్ = చిత్రకూటపర్వతమును, అనుప్రాప్య = చేరి, రమ్యమ్ = సుందరమగు, ఆవసథమ్ = పర్ణశాలను, కృత్వా = నిర్మించుకొని, తత్ర = ఆ వనమందు, రమమాణాః = విహరించుచున్నవారై, దేవగంధర్వసంకాశాః = దేవతలు, గంధర్వులతో సమానులై, సుఖమ్ = సుఖముగా, న్యవసన్ = నివసించిరి.

**తా.** ఆ సీతారామలక్ష్మణులు ముువ్వురును ఒక యడవినుండి వేఱొక యడవి కేగుచు, సమృద్ధిగ నీరు గల నదులు దాటి, భరద్వాజు నానతి ననుసరించి చిత్రకూటము చేరి, సుందరమగు పర్ణశాల నిర్మించుకొని యట దేవగంధర్వసమానులై సుఖముగా నుండిరి.

**చిత్రకూటం గతే రామే పుత్రశోకాతుర స్తథా, 32**
**రాజా దశరథః స్వర్గం జగామ విలపన్ సుతమ్.**

**ప్ర.** రామే = రాముడు, చిత్రకూటమ్ = చిత్రకూట పర్వతమునకు, తథా = అట్లు, గతే = పోగా, రాజా = రాజైన, దశరథః = దశరథుడు, సుతమ్ = కుమారునిగూర్చి, విలపన్ = ఏడ్చుచు, స్వర్గమ్ = స్వర్గమును గూర్చి, జగామ = పోయెను.

**తా.** రాముడు చిత్రకూటమున కేగగా మహారాజగు దశరథుడు పుత్రశోకముచే పీడింపబడినవాడై, కుమారుని తలంచి యేడ్చుచు స్వర్గస్థుడయ్యెను.

**మృతే తు తస్మిన్ భరతో వసిష్ఠప్రముఖై ర్ద్విజైః, 33**
**నియుజ్యమానో రాజ్యాయ నైచ్ఛ ద్రాజ్యం మహాబలః.**

**ప్ర.** తస్మిన్ = ఆ దశరథుడు, మృతే తు = మరణించినవాడు కాగా, మహాబలః = (రాజ్యపాలన చేయుటకు చాలిన) గొప్ప బలము కల, భరతః = భరతుడు, వసిష్ఠప్రముఖైః = వసిష్ఠుడు మున్నగు, ద్విజైః = బ్రాహ్మణులచే, రాజ్యాయ = రాజ్యపాలనమునకై, నియుజ్యమానః = నియోగింపబడుచున్నవాడైనను, రాజ్యమ్ = రాజ్యమును, న+ఐచ్ఛత్ = కోరలేదు.

**తా.** దశరథుడు మరణింపగా వసిష్ఠుడు మున్నగు బ్రాహ్మణ శ్రేష్ఠులు రాజ్యపాలనకై నియోగించినను, రాజ్యనిర్వహణ సమర్థుడయ్యును భరతుడు రాజ్యము నంగీకరింపలేదు.

**స జగామ వనం వీరో రామపాదప్రసాదకః. 34**

**ప్ర.** వీరః = శక్తిమంతుడగు, సః = ఆ భరతుడు, రామపాదప్రసాదకః = పూజ్యుడగు రాముని ప్రసన్నుని చేసికొనువాడై, వనమ్ = (రాముడు నివసించిన) అడవిని గూర్చి, జగామ = పోయెను.

**తా.** విషయములచే ఆకర్షింపబడనివాడగు భరతుడు పూజ్యుడగు రాముని ప్రసన్నుని చేసికొనుటకై యడవికి వెడలెను.

**గత్వా తు సుమహాత్మానం రామం సత్యపరాక్రమమ్,**
**అయాచత్ భ్రాతరం రామ మార్యభావపురస్కృతః. 35**

**ప్ర.** సః = (ఆ భరతుడు), ఆర్యభావపురస్కృతః = తనయొక్క యోగ్యవ్యక్తిత్వముచే కొనియాడబడినవాడై, సుమహాత్మానమ్ = ప్రసన్నహృదయుడును, సత్యపరాక్రమమ్ = సత్యము తప్పనివాడును అగు, రామమ్ = రామునిగూర్చి, గత్వా తు = వెడలి, భ్రాతరమ్ = అన్నయగు, రామమ్ = రాముని, అయాచత = కోరెను.

**తా.** వినయము గల భరతు డట్లు ప్రసన్నహృదయుడు, సత్యవ్రత నిష్ఠుడు, తన అన్న యగు రాముని సమీపించి, యిట్లు ప్రార్థించెను.

**త్వమేవ రాజా ధర్మజ్ఞ ఇతి రామం వచోఽబ్రవీత్.**

**ప్ర.** ధర్మజ్ఞః = (జ్యేష్ఠుడు జీవించియుండగా కనిష్ఠుడు రాజ్యార్హుడు కాడు అను) ధర్మ మెఱిగినవాడగు, త్వమ్ ఏవ = నీవే, రాజా = రాజువు, ఇతి = అని, రామమ్ = రామునిగూర్చి, వచః = ఈ వాక్కును, అబ్రవీత్ = పలికెను.

**తా.** 'జ్యేష్ఠుడు జీవించియుండగా కనిష్ఠుడు రాజు కారా దనుట

ధర్మసమ్మతము. నీ వీ ధర్మ మెఱిగినవాడవు. నీవే రాజువు' అని భరతుడు రామునితో పలికెను.

**రామోஉపి పరమోదారః సుముఖః సుమహాయశాః,** **36**
**న చైచ్ఛత్ పితురాదేశాత్ రాజ్యం రామో మహాబలః.**

**ప్ర.** రామః అపి = (ఆశ్రితుల మనస్సు) రంజింపజేయు వాడయ్యును, పరమోదారః (అపి) = కోరినదెల్ల, తుదకు తననుకూడ యిచ్చువాడయ్యును, సుముఖః (అపి) = (అడుగువాడు లభించుటచే) ప్రసన్నమైన ముఖము కలవాడైనను, సుమహాయశాః (అపి) = (తమ వంశములో నెవ్వని కడకైన యాచకుడు వచ్చి నిష్ఫలుడై వెడలలేదు అను) గొప్ప కీర్తి కలవా డైనను, మహాబలః (అపి) = ఆశ్రితుల కోర్కెల నీడెర్ప) సమర్థుడయ్యును, పితుః = తండ్రియొక్క, ఆదేశాత్ = ఆజ్ఞవలన, రామః = రాముడు, రాజ్యమ్ = రాజ్యమును, న చ ఐచ్ఛత్ = కోరలేదు.

**తా.** రాముడు తా నాశ్రితుల మనస్సును రంజింపజేయువా డయ్యును, కోరినదెల్ల నిచ్చు స్వభావము కలవాడయ్యును, తన్ను యాచించువాడు లభించుటచే ప్రసన్నుడైనను, ఇక్ష్వాకువంశ్యుల కడకు యాచింపబోయి విఫలుడైనవాడు లేడను గొప్ప సత్కీర్తి కలిగియున్నను, ఆశ్రితుల కోర్కెల నీడేర్చు కౌశలము కలవాడయ్యును, తండ్రియాజ్ఞచే, రాజ్యము నభిలషింపలేదు.

**పాదుకే చాస్య రాజ్యాయ న్యాసం దత్త్వా పునః పునః,** **37**
**నివర్తయామాస తతో భరతం భరతాగ్రజః.**

**ప్ర.** చ = కాన, భరతాగ్రజః = భరతుని అన్న యగు రాముడు,

రాజ్యాయ = రాజ్యముచేయుకొఱకు, అస్య = ఈ భరతునకు, పాదుకే = పావుకోళ్ళను, న్యాసమ్ = తన ప్రతినిధిగా, దత్వా = ఇచ్చి, పునః పునః = మాటిమాటికి, తతః = అటనుండి, నివర్తయామాస = మరల్చెను.

**తా.** భరతుని యన్న యగు రాముడు రాజ్యము చేయుటకు పాదుకలను తన ప్రతినిధిగా భరతున కిచ్చి, తన్ను వీడిపోవ నిచ్చగింపని భరతునకు మాటిమాటికి నచ్చ బలికి, యటనుండి వెనుకకు బంపెను.

**స కామ మనవాప్యైవ రామపాదా వుపస్పృశన్, 38**
**నందిగ్రామేఽ కరోత్ రాజ్యం రామాగమనకాంక్షయా.**

**ప్ర.** సః = ఆ భరతుడు, కామమ్ = కోరికను, అనవాప్య ఏవ = పొందకయే, రామపాదౌ = రాముని పాదుకలు, ఉపస్పృశన్ = తాకుచు, రామాగమనకాంక్షయా = రాము డెప్పుడు వచ్చునా యను కోరికతో, నందిగ్రామే = నందిగ్రామమందు, రాజ్యమ్ అకరోత్ = రాజ్యమును పాలించెను.

**తా.** భరతుడును రాము నయోధ్యకు తీసికొనివచ్చుట లేదా తాను రాముని సన్నిధిలో నాతనిని సేవించుచు మెలగుట యను కోరిక తీరకయే వెడలి, రాముని పాదుకలను ప్రత్యహము భక్తితో సేవించుచు, రాము డెప్పుడు మరలివచ్చునా యను నాకాంక్షతో నయోధ్యకు దాపుననున్న నందిగ్రామ మను యూరిలో నుండి రామాజ్ఞారూపముగ రాజ్యపాలన మొనరించెను.

అయోధ్యాకాండము సమాప్తము.

# అరణ్యకాండము

**గతే తు భరతే శ్రీమాన్ సత్యసంధో జితేంద్రియః,** **39**
**రామస్తు పున రాలక్ష్య నాగరస్య జనస్య చ,**
**తత్రాగమన మేకాగ్రో దండకాన్ ప్రవివేశ హ.** **40**

**ప్ర.** భరతే = భరతుడు, గతే = అట్లు వెడలగా, శ్రీమాన్ = ప్రకాశమానుడును, సత్యసంధః = మర్యాద తప్పనివాడును, జితేంద్రియః = ఇంద్రియములను జయించినవాడును అగు, రామః = రాముడు, తత్ర = ఆ చిత్రకూటమున, నాగరస్య జనస్య = పట్టణవాసులయొక్క, పునః = మఱల, ఆగమనమ్ = రాకను, ఆలక్ష్య = ఆలోచించి, ఏకాగ్రః = (పితృవాక్యపరిపాలన) తత్పరుడై, దండకాన్ = దండకారణ్యమును, ప్రవివేశ = ప్రవేశించెను.

**తా.** భరతు డట్లు వెడలగా, ప్రతిజ్ఞాభంగ మగునేమో యను భయము తొలగగా ప్రకాశమానుడును, భరతు డెంత నిర్బంధించినను తన ప్రతిజ్ఞనుండి చలింపక దానిని సత్య మొనరించినవాడును, రాజ్య భోగములం దాసక్తి లేనివాడును అగు రాముడు పురప్రజలు మాటిమాటికి వచ్చి తన్నయోధ్యకు రమ్మని నిర్బంధింతురని యోచించి పితృవాక్యపరిపాలనమునం దేకాగ్రచిత్తుడై దండకారణ్యము ప్రవేశించెను.

**ప్రవిశ్య తు మహారణ్యం రామో రాజీవలోచనః,**
**విరాధం రాక్షసం హత్వా శరభంగం దదర్శ హ,** **41**
**సుతీక్ష్ణం చాప్యగస్త్యం చ అగస్త్యభ్రాతరం తథా.**

**ప్ర.** మహారణ్యమ్ = గొప్ప అడవిని, ప్రవిశ్య = ప్రవేశించి, రాజీవలోచనః = (వికసించిన) తామరపూల వంటి కన్నులు కలవాడగు, రామః = రాముడు, విరాధం రాక్షసమ్ = విరాధుడను రాక్షసుని, హత్వా = చంపి, శరభంగమ్ = శరభంగమహామునిని, సుతీక్ష్ణం చ అపి = సుతీక్ష్ణ మునిని, అగస్త్యం చ = అగస్త్యమహామునిని, తథా = అట్లే, అగస్త్యభ్రాతరమ్ = అగస్త్యుని సోదరుడగు సుదర్శనమునిని, దదర్శ = దర్శించెను.

**తా.** మున్నెన్నడు చూడని యా మహారణ్యమును చూచుటచే కూతూహలముతో విప్పారిన కమలములవంటి కన్నులు గల రాముడా యడవిలో ప్రవేశించి, విరాధుడను రాక్షసుని బరిమార్చి, శరభంగ మునిని, సుతీక్ష్ణుని, అగస్త్యుని, అగస్త్యముని సోదరుడగు సుదర్శనుడను మునిని దర్శించెను.

**అగస్త్యవచనాచ్చైవ జగ్రాహైంద్రం శరాసనమ్, 42**
**ఖడ్గం చ పరమప్రీత స్తూణీ చాక్షయసాయకౌ.**

**ప్ర.** అగస్త్యవచనాత్ చ ఏవ = అగస్త్యుని ఆదేశానుసారము, ఐంద్రమ్ = ఇంద్రునకు సంబంధించిన, శరాసనమ్ = వింటిని, ఖడ్గం చ = కత్తిని, అక్షయసాయకౌ = తఱుగని బాణములుకల, తూణీ చ = రెండు అమ్ములపొదులను, పరమప్రీతః = మిక్కిలి ప్రీతి నందినవాడై, జగ్రాహ = స్వీకరించెను.

**తా.** అగస్త్యముని వచనానుసార మా మునికి దేవేంద్రు డొసగిన విల్లు, కత్తి, ఎంత వాడినను తఱుగని బాణములుకల అమ్ములపొదులు రెంటిని రాముడు మిగుల సంతసముతో స్వీకరించెను.

**వసత స్తస్య రామస్య వనే వనచరైః సహ, 43**
**ఋషయోఽభ్యాగమన్ సర్వే వధా యాసురరక్షసామ్.**

**ప్ర.** వనే = ఆ శరభంగుని తపోవనమందు, తస్య వసతః = ఆ రాముడు నివసించుచుండగా, సర్వే ఋషయః = మునులెల్లను, వనచరైః సహ = వనవాసులతో కలిసి, అసురరక్షసామ్ = అసుర స్వభావముకల రాక్షసులయొక్క, వధాయ = చంపుకొఱకు, అభ్యాగమన్ = వచ్చిరి.

**తా.** ఆ యడవిలో వనవాసులతో కలసి నివసించుచున్న రాముని కడకు ప్రాణములు తీయు స్వభావము గల రాక్షసులను వధింపుమని కోరుటకై ఋషు లేతెంచిరి.

**స తేషాం ప్రతిశుశ్రావ రాక్షసానాం తథా వనే. 44**

**ప్ర.** సః = రాముడు, రాక్షసానామ్ = రాక్షసులయొక్క, వనే = దండకారణ్యమందు, తేషామ్ = ఆ ఋషులకు, తథా = వారు కోరిన విధముగ, ప్రతిశుశ్రావ = ప్రతిజ్ఞ చేసెను.

**తా.** రాముడును రాక్షలు నివసించు ఆ దండకారణ్యమున మునుల ప్రార్థన మంగీకరించెను.

**ప్రతిజ్ఞాతశ్చ రామేణ వధః సంయతి రక్షసామ్,**
**ఋషీణా మగ్నికల్పానాం దండకారణ్యవాసినామ్. 45**

**ప్ర.** రామేణ = రామునిచే, దండకారణ్యవాసినామ్ = దండకారణ్యమున నివసించు, అగ్నికల్పానామ్ = అగ్నితో సమానులగు, ఋషీణామ్ = ఋషులకు, సంయతి = యుద్ధమందు, రక్షసామ్ = రాక్షసులయొక్క, వధః = చంపుట, ప్రతిజ్ఞాతః = ప్రతిజ్ఞ చేయబడినది.

**తా.** రాముడు దండకారణ్యమందు నివసించు అగ్నిసమానులగు మహర్షుల సన్నిధిలో యుద్ధమున రాక్షసులను వధింతునని ప్రతిన బూనెను.

**తేన తత్రైవ వసతా జనస్థాననివాసినీ,**
**విరూపితా శూర్పణఖా రాక్షసీ కామరూపిణీ. 46**

**ప్ర.** తత్ర ఏవ = అచ్చటనే, వసతా = నివసించుచున్న, తేన = ఆ రామునిచే, కామరూపిణీ = ఇచ్ఛవచ్చిన రూపము కల, శూర్పణఖా రాక్షసీ = శూర్పణఖ యను రక్కసి, విరూపితా = వికృతరూపము గలదిగా చేయబడినది.

**తా.** జనస్థాన మను దండకారణ్యమందలి యొక ప్రదేశమున వసించుచున్న రాముడు (రాముని కుడిచేయివంటి లక్ష్మణుడు) ఆ జనస్థానముననే నివసించునది, ఇచ్ఛవచ్చిన రూపము దాల్చునది, చేటలవంటి గోళ్ళతో సార్థకనామము గలది యగు శూర్పణఖ యను రక్కసి ముక్కుచెవులు కోసి వైరూప్యము కలిగించెను.

**తతః శూర్పణఖావాక్యా దుద్యుక్తాన్ సర్వరాక్షసాన్,**
**ఖరం త్రిశిరసం చైవ దూషణం చైవ రాక్షసమ్, 47**
**నిజఘాన రణే రామస్తేషాం చైవ పదానుగాన్.**

**ప్ర.** తతః = పిమ్మట, రామః = రాముడు, శూర్పణఖావాక్యాత్ = శూర్పణఖ మాటవలన, ఉద్యుక్తాన్ = యుద్ధమున కుద్యమించిన, సర్వరాక్షసాన్ = సకల (పదునాలుగువేల) రాక్షసులను, ఖరమ్ = ఖరుని, త్రిశిరసమ్ = త్రిశిరస్కుని, దూషణం రాక్షసం చైవ = దూషణుడను

రాక్షసుని, తేషాం = ఆ రాక్షసులయొక్క, పదానుగాన్ = అనుచరులను, రణే = యుద్ధమందు, నిజఘాన = చంపెను.

**తా.** పిమ్మట శూర్పణఖ మాటలు విని, యుద్ధసన్నద్ధులైన ఖరుడు, త్రిశిరస్కుడు, దూషణుడు మున్నగు రాక్షసులను, వారి యనుచరులను రాము డా యడవిలో నిశ్శేషముగా చంపివేసెను.

**వనే తస్మిన్ నివసతా జనస్థాననివాసినామ్, 48**
**రక్షసాం నిహతాన్యాసన్ సహస్రాణి చతుర్దశ.**

**ప్ర.** తస్మిన్ = ఆ, వనే = అడవియందు, నివసతా = నివసించుచున్న రామునిచే, జనస్థాననివాసినామ్ = జనస్థానమున నివసించునట్టి, రక్షసామ్ = రాక్షసులయొక్క, చతుర్దశ సహస్రాణి = పదునాలుగు వేలు, నిహతాని = చంపివేయబడినవి, ఆసన్ = ఆయెను.

**తా.** ఇ ట్లా వనమున నివసించుచున్న రాముడు జనస్థాన నివాసులగు పదునాలుగువేలమంది రాక్షసులను చంపెను.

**తతో జ్ఞాతివధం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః, 49**
**సహాయం వరయామాస మారీచం నామ రాక్షసమ్.**

**ప్ర.** తతః = పిమ్మట, జ్ఞాతివధం = జ్ఞాతి యగు ఖరుని చంపుటను, శ్రుత్వా = విని, రావణః = రావణుడు, క్రోధమూర్ఛితః = కోపముచే మూఢుడై, మారీచం నామ = మారీచు డను, రాక్షసమ్ = రాక్షసుని, సహాయమ్ = సహాయునిగా, వరయామాస = వరించెను.

**తా.** పిమ్మట జ్ఞాతి యగు ఖరుడు మున్నగు అసంఖ్యాకులగు రాక్షసులను రాముడు వధించుటను శూర్పణఖవల్ల నెఱిగిన రావణుడు

కోపముచే మూఢుడై మారీచు డను రాక్షసుని తనకు సహాయునిగా కోరెను.

**వార్యమాణ స్సుబహుశో మారీచేన స రావణః, 50**
**న విరోధో బలవతా క్షమో రావణ! తేన తే.**

**ప్ర.** రావణ! = ఓ రావణా! బలవతా = బలవంతు డగు, తేన = ఆ రామునితో, విరోధః = విరోధము, తే = నీకు, న క్షమః = తగదు (అని), సః రావణః = ఆ రావణుడు, సుబహుశః = అనేకమార్లు, మారీచేన = మారీచునిచే, వార్యమాణః (అభూత్) = నివారింపబడెను.

**తా.** ఓ రావణా! 'బలవంతుడగు ఆ రామునితో నీకు విరోధము తగదు' అని పలుమార్లు మారీచుడు రావణుని ఆ ప్రయత్నము నుండి వారించెను.

**అనాదృత్య తు తద్వాక్యం రావణః కాలచోదితః, 51**
**జగామ సహమారీచ స్తస్యాశ్రమపదం తదా.**

**ప్ర.** రావణః = రావణుడు, కాలచోదితః = మృత్యువుచే ప్రేరణ చేయబడినవాడై, తద్వాక్యమ్ = మారీచుని మాటను, అనాదృత్య = లెక్కచేయక, తదా = అప్పుడే, సహమారీచః = మారీచసహితుడై, తస్య = రామునియొక్క, ఆశ్రమపదమ్ = ఆశ్రమస్థానమునుగూర్చి, జగామ = వెడలెను.

**తా.** మృత్యుదేవత ప్రేరించగా నా రావణు డాతని మాట పెడచెవి బెట్టి యప్పుడే మారీచునితో గలసి రాముని యాశ్రమమున కేగెను.

**తేన మాయావినా దూర మపవాహ్య నృపాత్మజౌ,** **52**
**జహార భార్యాం రామస్య గృధ్రం హత్వా జటాయుషమ్.**

**ప్ర.** మాయావినా = మోసకాడగు, తేన = ఆ మారీచునిచే, నృపాత్మజౌ = రాజపుత్రులగు రామలక్ష్మణులను, దూరమ్ = చాలదూరము, అపవాహ్య = పోవనంపి, గృధ్రం = గ్రద్ద యగు, జటాయుషమ్ = జటాయువును, హత్వా = చంపి, రామస్య భార్యామ్ = రాముని భార్యయగు సీతను, జహార = అపహరించెను.

**తా.** మాయలమారి యగు మారీచుని సాయముతో నా రామలక్ష్మణులను దూరము పంపి, జటాయు వను గ్రద్ద యడ్డుపడగా దానిని చంపి రాముని భార్య నా రావణు డపహరించెను.

**గృధ్రం చ నిహతం దృష్ట్వా హృతాం శ్రుత్వా చ మైథిలీమ్,**
**రాఘవ శ్శోకసంతప్తో విలలా పాకులేంద్రియః.**

**ప్ర.** గృధ్రమ్ = గ్రద్దయగు జటాయువును, నిహతమ్ = చావనున్న వానినిగా, దృష్ట్వా చ = చూచియు, మైథిలీమ్ = సీతను, హృతామ్ = అపహరింపబడినదానినిగా, శ్రుత్వా చ = వినియు, రాఘవః = రాముడు, శోకసంతప్తః = దుఃఖపీడితుడై, ఆకులేంద్రియః = కలతనొందిన సర్వేంద్రియములు కలవాడై, విలలాప = ఏడ్చెను.

**తా.** జటాయువు కొనప్రాణముతో చావుకు దగ్గరగా నుండుట చూచియు, సీతను అపహరించిరని వినియు రాముడు మిక్కిలి దుఃఖముతో విలపించెను.

**తత స్తేనైవ శోకేన గృధ్రం దగ్ధ్వా జటాయుషమ్,** **54**

**మార్గమాణో వనే సీతాం రాక్షసం సందదర్శ హ,**
**కబంధం నామ రూపేణ వికృతం ఘోరదర్శనమ్. 55**

**ప్ర.** తతః = పిమ్మట, తేన శోకేన ఏవ = ఆ దుఃఖముతోనే, గృధ్రమ్ = గ్రద్ద యగు, జటాయుషమ్ = జటాయువును, దగ్ధ్వా = తగులబెట్టి, వనే = అడవియందు, సీతామ్ = సీతను, మార్గమాణః = వెదకుచున్నవాడై, రూపేణ = ఆకృతిచే, వికృతమ్ = వికారము కలవాడును, ఘోరదర్శనమ్ = భయజనకమగు దర్శనము గలవాడును, అగు కబంధం నామ = కబంధు డను, రాక్షసమ్ = రాక్షసుని, సందదర్శ = చూచెను.

**తా.** పిమ్మట, ఆ శోకముతోనే గ్రద్దయైనను తన తండ్రి కాప్త మిత్రుడు, తనకై ప్రాణములకు తెగించి యుద్ధ మొనర్చి మరణించినవాడు గాన ఆ జటాయువునకు దహనసంస్కార మొనర్చి, రాముడా యడవిలో సీత నన్వేషించుచు నొకచో వికృతరూపముతో, భయంకరుడై యున్న కబంధు డను రాక్షసుని గాంచెను.

**తం నిహత్య మహాబాహుర్దదాహ స్వర్గతశ్చ సః.**

**ప్ర.** మహాబాహుః = గొప్పభుజములు కల రాముడు, తం = ఆ కబంధుని, నిహత్య = చంపి, దదాహ = తగులబెట్టెను. సః = ఆ కబంధుడును, స్వర్గతః = స్వర్గస్థుడయ్యెను.

**తా.** గొప్ప భుజములు కల రాముడా కబంధుని వధించి అగ్ని సంస్కారము చేయగా నాతడు స్వర్గమున కేగెను.

**స చాస్య కథయామాస శబరీం ధర్మచారిణీమ్, 56**
**శ్రమణీం ధర్మనిపుణా మభిగచ్ఛేతి రాఘవ!**

**ప్ర.** సః చ = ఆ కబంధుడును, రాఘవ! = రామా! ధర్మచారిణీమ్ = ధర్మిష్ఠురాలును, శ్రమణీమ్ = సన్న్యాసినియు, ధర్మనిపుణామ్ = ధర్మసూక్ష్మముల నెఱిగినదియు అగు, శబరీమ్ = శబరిని, అభిగచ్ఛ ఇతి = కలసికొమ్మని, అస్య = ఈ రామునకు, కథయామాస = తెలిపెను.

**తా.** ఆ కబంధుడును స్వర్గమున కేగుచు 'ఓ రామా! ధర్మము నాచరించు స్వభావము కలిగి, సన్న్యాసినియై ధర్మసూక్ష్మముల నెఱిగిన యొక శబరస్త్రీ (వైశ్యునకు క్షత్రియవనితకు బుట్టినది) కలదు. నీ వామెను కలసికొమ్మని రామునకు తెలిపెను.

**సోఽభ్యగచ్ఛ న్మహాతేజాః శబరీం శత్రుసూదనః,** **57**
**శబర్యా పూజితః సమ్య గ్రామో దశరథాత్మజః.**

**ప్ర.** మహాతేజాః = గొప్ప తేజస్సుకలవాడును, శత్రుసూదనః = శత్రువులను నశింపజేయువాడును అగు, సః = రాముడు, శబరీమ్ = శబరివద్దకు, అభ్యగచ్ఛత్ = పోయెను. దశరథాత్మజః = దశరథపుత్రుడగు, రామః = రాముడు, శబర్యా = శబరిచే, సమ్యక్ = చక్కగా, పూజితః = పూజింపబడెను.

**తా.** మహాతేజశ్శాలియు, శత్రునాశకుడును అగు ఆ రాముడు, శబరికడకు తానే పోయెను. ఆమెయు దశరథతనయుడగు రాముని చక్కగా పూజించెను.

అరణ్యకాండము సమాప్తము.

# కిష్కింధాకాండము

**పంపాతీరే హనుమతా సంగతో వానరేణ హ,** **58**
**హనుమద్వచనా చ్చైవ సుగ్రీవేణ సమాగతః.**

**ప్ర.** (రామః = రాముడు) పంపాతీరే = పంపానది యొడ్డున, వానరేణ = వానరుడగు, హనుమతా = హనుమంతునితో, సంగతః = కలిసికొనెను, హనుమద్వచనాత్ = హనుమంతుని సూచనవలన, సుగ్రీవేణ = సుగ్రీవునితో, సమాగతః = కలసికొనెను.

**తా.** అనంతరము రాముడు పంప అను పద్మసరస్సు ఒడ్డున హనుమంతు డను వానరుని కలసికొనెను. హనుమంతుని సూచన ననుసరించి సుగ్రీవునికూడ కలిసి అతనితో చెలిమి చేసెను.

**సుగ్రీవాయ చ తత్సర్వం శంస ద్రామో మహాబలః,** **59**
**ఆదిత స్తద్ యథావృత్తం సీతాయాశ్చ విశేషతః.**

**ప్ర.** మహాబలః = గొప్పబలముకల, రామః = రాముడు, సుగ్రీవాయ = సుగ్రీవునికొఱకు, ఆదితః = మొదటినుండియు, తత్ = దానిని, యథావృత్తం = జరిగినది జరిగినట్లుగా, విశేషతః = విశేషించి, సీతాయాః = సీతయొక్క, తత్ = ఆ వృత్తాంతమును, సర్వం = సమస్తమును, శంసత్ = తెలిపెను.

**తా.** మహాబలసమన్వితుడగు రాముడు మొదటినుండి తన వృత్తాంతమును, విశేషించి సీత యపహరింపబడిన వృత్తాంతమును యథాతథముగ సుగ్రీవున కెఱింగించెను.

**సుగ్రీవ శ్చాపి తత్సర్వం శ్రుత్వా రామస్య వానరః, 60**
**చకార సఖ్యం రామేణ ప్రీత శ్చై వాగ్నిసాక్షికమ్.**

**ప్ర.** వానరః = వానరుడగు, సుగ్రీవః చాపి = సుగ్రీవుడును, రామస్య = రామునియొక్క, సర్వమ్ = సమస్తమైన, తత్ = ఆ వృత్తాంతమును, శ్రుత్వా = విని, ప్రీతః = సంతోషించినవాడై, అగ్నిసాక్షికమ్ = అగ్నిసాక్షికముగ, రామేణ = రామునితో, సఖ్యమ్ = చెలిమిని, చకార = చేసెను.

**తా.** వానరశ్రేష్ఠుడగు సుగ్రీవుడును రాముని వృత్తాంత మంతయు విని, యాతనియం దనురాగముతో అగ్నిసాక్షికముగ చెలిమి చేసెను.

**తతో వానరరాజేన వైరానుకథనం ప్రతి, 61**
**రామా యావేదితం సర్వం ప్రణయా ద్దుఃఖితేన చ.**

**ప్ర.** తతః = పిమ్మట, వైర+అనుకథనం ప్రతి = (వాలితో) శత్రుత్వమునుగూర్చి అడిగిన విషయమున, దుఃఖితేన = దుఃఖము పొందిన, వానరరాజేన = కోతుల రాజగు సుగ్రీవునిచే, రామాయ = రామునికొరకు, ప్రణయాత్ = ప్రీతితో, సర్వం = సమస్తమును, ఆవేదితమ్ = తెలుపబడినది.

**తా.** అట్లు మైత్రి నందిన పిమ్మట, 'నీకు వాలితో విరోధ మెట్లు సంభవించె'నని పరమమిత్రుడగు రాముడడుగగా, తన వృత్తాంతము దలచికొని యొకింత దుఃఖితుడై, వానరరాజగు సుగ్రీవుడు స్నేహముతో తన పూర్వవృత్త మెల్ల రామున కెఱింగించెను.

**ప్రతిజ్ఞాతం చ రామేణ తదా వాలివధం ప్రతి, 62**
**వాలినశ్చ బలం తత్ర కథయామాస వానరః.**

**ప్ర.** తదా = అప్పుడు, రామేణ = రామునిచే, వాలివధం ప్రతి = వాలిని చంపుటను గూర్చి, ప్రతిజ్ఞాతమ్ = ప్రతిజ్ఞ చేయబడెను. తత్ర = ఆ సందర్భమున, వానరః = సుగ్రీవుడు, వాలినః = వాలియొక్క, బలం = బలమును, కథయమాస = చెప్పెను.

**తా.** సుగ్రీవుని వృత్తాంత మెఱిగిన తోడనే రాముడు వాలిని వధింతునని ప్రతిన బూనెను. సుగ్రీవుడు వాలిబలమునుగూర్చి అత డరుణోదయమున వెడలి సూర్యోదయములోపల నాల్గు సముద్రము లెంత మాత్రము శ్రమలేక దాటి వచ్చెడివాడని రామునకు తెలియజెప్పెను.

**సుగ్రీవ శ్శంకిత శ్చాసీ న్నిత్యం వీర్యేణ రాఘవే. 63**

**ప్ర.** సుగ్రీవః = సుగ్రీవుడు, నిత్యమ్ = ప్రతిదినము, వీర్యేణ = పరాక్రమవిషయమున, రాఘవే = రామునియందు, శంకితః = సందేహము కలవాడై, ఆసీత్ = ఉండెను.

**తా.** వాలి నెదిర్చి వధింపగల పరాక్రమము రామునకు కలదా యను శంక మాత్రము సుగ్రీవునకు మాటిమాటికి కలుగుచుండెను.

**రాఘవప్రత్యయార్థం తు దుందుభేః కాయ ముత్తమమ్,**
**దర్శయామాస సుగ్రీవో మహాపర్వతసన్నిభమ్. 64**

**ప్ర.** సుగ్రీవః = సుగ్రీవుడు, రాఘవప్రత్యయార్థమ్ = రామునిపై విశ్వాసము కలుగు కొఱకు, మహాపర్వతసన్నిభమ్ = గొప్ప కొండతో

సాటియగు, దుందుభేః = దుందుభియను రాక్షసునియొక్క, ఉత్తమం = మిక్కిలి పెద్దదగు, కాయమ్ = శరీరమును, దర్శయామాస = చూపెను.

**తా.** రాముని పరాక్రమముపై తనకు విశ్వాసము కలుగుకొఱకు సుగ్రీవుడు గొప్ప పర్వతమువలె నున్నతమై, పూర్వము వాలిచే చంపబడి సమీపమున పడియున్న దుందుభి యను రాక్షసుని శరీరమును రామునకు చూపెను.

**ఉత్స్మయిత్వా మహాబాహుః ప్రేక్ష్య చాస్థి మహాబలః,**
**పాదాంగుష్ఠేన చిక్షేప సంపూర్ణం దశయోజనమ్. 65**

**ప్ర.** మహాబలః = గొప్పబలము కలవాడును, మహాబాహుః = గొప్ప బాహువులు కలవాడును అగు రాముడు, ఉత్స్మయిత్మా = చిరునవ్వు నవ్వి, అస్థి = దుందుభియొక్క యెముకలగూడును, ప్రేక్ష్య = చూచి, పాదాంగుష్ఠేన = కాలి బొటనవ్రేలితో, సంపూర్ణమ్ = పూర్తిగా, దశయోజనమ్ = పది యోజనములు, చిక్షేప = విసరెను.

**తా.** అపరిమేయబలము కలవాడు, బలిష్ఠములగు బాహువులు కలవాడును అగు రాముడును ఆ యెముకలగూడును జూచి యిదెంత యని తలంచి యొకింత మందహాసముచేసి, ఆనాడు వాలి పాదముతో నెత్తి యామడ దూరము విసరగా, తాను కేవలము కాలి బొటనవ్రేలితో నెత్తి పూర్తిగ పది యామడల దూరము విసరివైచెను.

**బిభేద చ పునః సాలాన్ సప్తైకేన మహేషుణా,**
**గిరిం రసాతలం చైవ జనయన్ ప్రత్యయం తథా. 66**

**ప్ర.** తథా = అట్లే, ప్రత్యయమ్ = విశ్వాసమును, జనయన్ = కలిగించుచు, పునః = తిరిగి, సప్తసాలాన్ = ఏడు సాలవృక్షములను, గిరిం = కొండను, రసాతలం చ ఏవ = పాతాళమును కూడ, ఏకేన = ఒకే, మహేషుణా = గొప్ప బాణముతో, బిభేద = చీల్చెను.

**తా.** అంతతో తృప్తినందని సుగ్రీవుని విశ్వాసముకొరకై మఱల ఏడు సాల వృక్షములను, పర్వతమును, పాతాళమును గూడ నొకే మహాబాణముచే ఛేదించెను.

**తతః ప్రీతమనా స్తేన విశ్వస్తః స మహాకపిః,**
**కిష్కింధాం రామసహితో జగామ చ గుహాం తదా. 67**

**ప్ర.** తతః = పిమ్మట, తేన = ఆ పరాక్రమ ప్రదర్శనముచే, ప్రీతమనాః = సంతుష్టాంతరంగుడును, విశ్వస్తః = నమ్మకము కలవాడును అగు, మహాకపిః = సుగ్రీవుడు, రామసహితః = రామునితో కూడినవాడై, కిష్కింధామ్ = కిష్కింధ యను, గుహామ్ = గుహను(కు), తదా = అప్పుడే, జగామ = పోయెను.

**తా.** అట్లు రాముడు సాలాదులను ఛేదింపగా నింక నితడు వాలిని చంప సమర్థుడని విశ్వాసము పొంది, సంతుష్టుడైన యా కపిముఖ్యుడప్పుడు రామునితో కలసి గుహవలె పర్వతముల నడుమ నున్న కిష్కింధ యను పేరుగల వానరరాజధాని కేగెను.

**తతోఽ గర్జ ద్ధరివరః సుగ్రీవో హేమపింగళః,**
**తేన నాదేన మహతా నిర్జగామ హరీశ్వరః. 68**

**ప్ర.** తతః = అంతట, హరివరః = కపిశ్రేష్ఠుడును, హేమపింగళః

= బంగారువలె పింగళవర్ణముతో నొప్పువాడును అగు, సుగ్రీవః = సుగ్రీవుడు, అగర్జత్ = గర్జించెను. మహతా = గొప్పదగు, తేన = ఆ, నాదేన = ధ్వనిచే, హరీశ్వరః = వాలి, నిర్జగామ = (తన గృహము నుండి) వెలువడెను.

**తా.** అట్లు కిష్కింధ కేతెంచిన బంగారువలె పింగళవర్ణముతో నొప్పు కపిశ్రేష్ఠుడగు సుగ్రీవు డెలుగెత్తి గర్జించెను. ఆ గొప్ప ధ్వని నాలించి వానరరాజగు వాలి తన గృహము నుండి వెలువడెను.

**అనుమాన్య తదా తారాం సుగ్రీవేణ సమాగతః,**
**నిజఘాన చ తత్రైనం శరేణైకేన రాఘవః. 69**

**ప్ర.** తదా = అప్పుడు, (వాలీ = వాలి), తారామ్ = భార్యయగు తారను, అనుమాన్య = ఒప్పించి, సుగ్రీవేణ = సుగ్రీవునితో, సమాగతః = (యుద్ధమునకు) తలపడెను, తత్ర = ఆ యుద్ధమున, ఏనమ్ = ఈ వాలిని, రాఘవః = రాముడు, ఏకేన శరేణ = ఒకే బాణముతో, నిజఘాన = చంపెను.

**తా.** అపుడు పోవలదని వారించుచున్న తార నొడబఱచి సుగ్రీవునితో వాలి యుద్ధమునకు తలపడెను. ఆ వాలిసుగ్రీవుల యుద్ధము జరుగు సందర్భమున రాము డొకే బాణముతో వాలిని చంపెను.

**తతః సుగ్రీవవచనాత్ హత్వా వాలినమాహవే,**
**సుగ్రీవ మేవ తద్రాజ్యే రాఘవః ప్రత్యపాదయత్. 70**

**ప్ర.** రాఘవః = రాముడు, సుగ్రీవవచనాత్ = సుగ్రీవునకు

చెప్పిన విధముగ, ఆహవే = యుద్ధమునందు, వాలినం = వాలిని, హత్వా = వధించి, తతః = పిమ్మట, తద్రాజ్యే = అతని రాజ్యమున, సుగ్రీవమ్ ఏవ = సుగ్రీవునే, ప్రత్యపాదయత్ = ప్రతిష్ఠించెను.

**తా.** అట్లు సుగ్రీవుడు కోరిన విధముగా యుద్ధమున వాలిని వధించి, అతని రాజ్యమున రాముడు సుగ్రీవునే ప్రతిష్ఠించెను.

**స చ సర్వాన్ సమానీయ వానరాన్ వానరర్షభః,**
**దిశః ప్రస్థాపయామాస దిదృక్షు ర్జనకాత్మజామ్. 71**

**ప్ర.** సః = ఆ, వానరర్షభః = కోతుల రాజగు సుగ్రీవుడు, సర్వాన్ వానరాన్ = కోతులనెల్ల, సమానీయ = రప్పించి, జనకాత్మజామ్ = సీతను, దిదృక్షుః = చూడగోరినవాడై, దిశః = అన్ని దిక్కులకు, ప్రస్థాపయామాస = పంపెను.

**తా.** అంత వానరశ్రేష్ఠుడగు సుగ్రీవుడు సీత యెట నున్నదో చూడగోరినవాడై కోతులనెల్ల రప్పించి వారిని, నలుదెసలకు పంపెను.

కిష్కింధాకాండము సమాప్తము.

# సుందరకాండము

**తతో గృధ్రస్య వచనాత్ సంపాతే ర్హనుమాన్ బలీ,**
**శతయోజనవిస్తీర్ణం పుప్లువే లవణార్ణవమ్. 71**

**ప్ర.** తతః = పిమ్మట, గృధ్రస్య = గ్రద్దయగు, సంపాతేః = సంపాతి యొక్క, వచనాత్ = మాటవలన, బలీ = బలవంతుడగు, హనుమాన్ = ఆంజనేయుడు, శతయోజనవిస్తీర్ణమ్ = నూఱు యోజనములు వెడల్పుకల, లవణార్ణవమ్ = ఉప్పు సముద్రమును, పుప్లువే = దాటెను.

**తా.** అంత బలవంతుడగు హనుమంతుడు, సంపాతి యను గ్రద్ద 'ఇటనుండి నూఱు యోజనముల కావల సముద్రమధ్యమున లంకలో సీత యున్నది. కాన నీవు సముద్రము దాటుము. సీతను జూచెద'వని చెప్పగా ఆ మాట మన్నించి, నూఱు యోజనముల వెడల్పుగల ఉప్పుసముద్రము నవలీలగా దాటెను.

**తత్ర లంకాం సమాసాద్య పురీం రావణపాలితామ్,**
**దదర్శ సీతాం ధ్యాయంతీ మశోకవనికాం గతామ్. 72**

**ప్ర.** తత్ర = అచ్చట, రావణపాలితామ్ = రావణునిచే రక్షింపబడుచున్న, పురీమ్ = పట్టణమగు, లంకామ్ = లంకను, సమాసాద్య = చేరి, అశోకవనికాం గతామ్ = అశోకవనమం దున్నదియు, ధ్యాయంతీమ్ = (రామునే) తలంచుచున్నదియు అగు, సీతామ్ = సీతను, దదర్శ = చూచెను.

**తా.** అచట రావణునిచే పాలింపబడుచున్న లంకాపట్టణముచేరి యశోకవనమందు నిరంతరము రామధ్యానము చేయుచుండిన సీతాదేవిని దర్శించెను.

**నివేదయిత్వాఽభిజ్ఞానం ప్రవృత్తిం చ నివేద్య చ,**
**సమాశ్వాస్య చ వైదేహీం మర్దయామాస తోరణమ్. 73**

**ప్ర.** (సః = హనుమంతుడు), అభిజ్ఞానమ్ = గుర్తు అగు ఉంగరమును, నివేదయిత్వా = సీతాదేవి కిచ్చి, ప్రవృత్తిం చ = రాముని వార్తను కూడ, నివేద్య చ = తెలిపియు, వైదేహీమ్ = సీతను, సమాశ్వాస్య చ = ఊరడిల్లజేసియు, తోరణమ్ = బయటిద్వారమును, మర్దయామాస = నుగ్గుచేసెను.

**తా.** శ్రీరాముడు తన కిచ్చిన అంగులీయకమును సీతాదేవికి గుఱుతుగా నొసగి, సుగ్రీవునితో చెలిమి మొదలు వానరులను సీతాన్వేషణకై నలుదెసలకు పంపువఱకు గల రాముని వృత్తాంతమెల్ల నామె కెఱిగించి త్వరలో రాముడు వచ్చునని యామె నూరడిల్ల జేసి, హనుమ యశోకవనపు వెలుపలిద్వారమును చూర్ణము చేసెను.

**పంచ సేనాగ్రగాన్ హత్వా సప్త మంత్రిసుతా నపి,**
**శూర మక్షం చ నిష్పిష్య గ్రహణం సముపాగమత్. 74**

**ప్ర.** పంచ = ఐదుగురు, సేనాగ్రగాన్ = సేనాపతులను, సప్త = ఏడుగురు, మంత్రిసుతాన్ అపి = మంత్రిపుత్రులను కూడ, హత్వా = చంపి, శూరమ్ = పరాక్రమశాలి యగు, అక్షమ్ = అక్షకుమారుని, నిష్పిష్య = చూర్ణము చేసి, గ్రహణమ్ = పట్టుపడుటను, సముపాగమత్ = పొందెను.

**తా.** ఆ హనుమంతుడు రావణుని సేనాపతు లేవురిని, మంత్రి పుత్రు లేడుగురిని చంపి, పరాక్రమవంతుడగు అక్షకుమారుని చూర్ణముచేసి, ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రముచే కట్టువడెను.

**అస్త్రేణోన్ముక్త మాత్మానం జ్ఞాత్వా పైతామహా ద్వరాత్,**
**మర్షయన్ రాక్షసాన్ వీరో యంత్రిణ స్తాన్ యదృచ్ఛయా. 75**

**తతో దగ్ధ్వా పురీం లంకాం ఋతే సీతాం చ మైథిలీమ్,**
**రామాయ ప్రియ మాఖ్యాతుం పునరాయా న్మహాకపిః. 76**

**ప్ర.** వీరః = వీరుడు, మహాకపిః = మహాత్ముడగు ఆంజనేయుడు, పైతామహాత్ వరాత్ = బ్రహ్మవరమువలన, ఆత్మానమ్ = తన్ను, అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచే, ఉన్ముక్తమ్ = విడువబడినవానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, యదృచ్ఛయా = స్వేచ్ఛగా, యంత్రిణః = తన్ను లాగికొనిపోవుచున్న, రాక్షసాన్ = రాక్షసులను, మర్షయన్ = సహించుచు, తతః = పిమ్మట, మైథిలీం సీతాం ఋతే = సీతను విడచి, లంకాం పురీమ్ = లంకాపట్టణము నెల్ల, దగ్ధ్వా = కాల్చి, రామాయ = రామునకు, ప్రియమ్ = ప్రీతిని కలిగించు వార్తను, ఆఖ్యాతుం = తెలుపుటకు, పునః ఆయాత్ = మరల వచ్చెను.

**తా.** దేవదానవులకు చొరరాని లంకను ప్రవేశించి పలురాక్షస వీరులను పరిమార్చుటచే ప్రఖ్యాతమైన పరాక్రమము కల వానరశ్రేష్ఠుడగు హనుమంతుడు బ్రహ్మదేవుని వరముచే నప్రయత్నముగనే బ్రహ్మాస్త్రబంధము తొలగుట తెలిసికొని, రాక్షసులు తన్నీడ్చుకొని పోవుచున్నను, రావణుని చూడగోరి యది యెల్ల సహించి, రావణుని జూచి, పోవుచు, సీత వసించుచున్న ప్రదేశము

విడచి తక్కిన లంకాపురినెల్ల తగులబెట్టి రామునకు ప్రియము తెలుపుటకై మఱల నాతని కడ కేతెంచెను.

**సోఽ_భిగమ్య మహాత్మానం కృత్వా రామం ప్రదక్షిణమ్,**
**న్యవేదయ దమేయాత్మా దృష్టా సీతేతి తత్త్వతః. 77**

**ప్ర.** అమేయాత్మా = ఇంతయని తెలుపరాని బుద్ధివైభవముకల, సః = ఆ హనుమంతుడు, మహాత్మానమ్ = మహాత్ముడగు, రామమ్ = రాముని, అభిగమ్య = సమీపించి, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణము చేసి, సీతా = సీత, దృష్టా = చూడబడినది, ఇతి = అని, న్యవేదయత్ = తెలిపెను.

**తా.** మహాబుద్ధిమంతుడగు హనుమంతుడు సీతావియోగ మందును ధైర్యము వీడని రాముని దరి జేరి, ఆయనకు ప్రదక్షిణము చేసి, 'చూచితి సీత' నని యథాతథముగ విన్నవించెను.

సుందరకాండము సమాప్తము.

# యుద్ధకాండము

**తతః సుగ్రీవసహితో గత్వా తీరం మహోదధేః,**
**సముద్రం క్షోభయామాస శరై రాదిత్యసన్నిభైః. 78**

**ప్ర.** తతః = పిమ్మట, (రామః = రాముడు) సుగ్రీవసహితః = సుగ్రీవునితో కూడినవాడై, మహోదధేః = మహాసముద్రముయొక్క, తీరమ్ = ఒడ్డునుగూర్చి, గత్వా = వెడలి, ఆదిత్యసన్నిభైః = సూర్యునివలె తేజోవంతములగు, శరైః = బాణములచేత, సముద్రమ్ = సముద్రుని, క్షోభయామాస = కల్లోల మొనర్చెను.

**తా.** హనుమంతు డట్లు సీత యునికి తెలుపగా రాముడు సుగ్రీవ సహితుడై సముద్రుని కడ కేగి, సముద్రుడు మార్గ మీయకుండుటచే కోపించి సూర్యునివలె తేజోవంతములగు బాణములతో సముద్రమును కల్లోల మొనర్చెను.

**దర్శయామాస చాత్మానం సముద్రః సరితాం పతిః,**
**సముద్రవచనాచ్చైవ నలం సేతు మకారయత్. 79**

**ప్ర.** సరితాం = నదులకు, పతిః = భర్తయగు, సముద్రః = సముద్రుడు, ఆత్మానమ్ = తన నిజరూపమును, దర్శయామాస = చూపెను. సముద్రవచనాత్ చ ఏవ = సముద్రుని సూచన ననుసరించి, నలమ్ = నలుని(చే), సేతుమ్ = వంతెనను, అకారయత్ = నిర్మింపజేసెను.

**తా.** నదీపతియగు సముద్రుడు రాముని కోపమునకు బెదరి, తన నిజరూపముతో రాము నెదుట నిలచెను. సముద్రుని మాట విని

రాముడు నలుడను వానరశ్రేష్ఠునిచే సముద్రముపై సేతువును నిర్మింపజేసెను.

**తేన గత్వా పురీం లంకాం హత్వా రావణ మాహవే,**
**రామ స్సీతా మనుప్రాప్య పరాం వ్రీడా ముపాగమత్. 80**

**ప్ర.** తేన = ఆ సేతువుచే, లంకాం పురీమ్ = లంకానగరమును గూర్చి, గత్వా = వెడలి, రావణమ్ = రావణుని, ఆహవే = యుద్ధమందు, హత్వా = చంపి, రామః = రాముడు, సీతామ్ = సీతను, అనుప్రాప్య = చేరి, పరామ్ = మిక్కిలి, వ్రీడామ్ = సిగ్గును, ఉపాగమత్ = పొందెను.

**తా.** ఆ సేతుమార్గమున రాముడు లంకను జేరి యుద్ధమున రావణుని చంపి, సీతను సమీపించి, చిరకాలము పరునింట నుండిన యీామె నెట్లు స్వీకరించుట యని మిగుల సిగ్గుపడెను.

**తా మువాచ తతో రామః పరుషం జనసంసది,**
**అమృష్యమాణా సా సీతా వివేశ జ్వలనం సతీ. 81**

**ప్ర.** తతః = అంత, రామః = రాముడు, జనసంసది = దేవతలు మున్నగువారు పలువురిలో, తామ్ = సీతను, పరుషమ్ = కఠినముగా, ఉవాచ = పలికెను. అమృష్యమాణా = సహింపలేనిదై, సతీ = పతివ్రతయగు, సా సీతా = ఆ సీత, జ్వలనమ్ = అగ్నిని, వివేశ = ప్రవేశించెను.

**తా.** అంత నా రాముడు దేవాదు లెల్లరు చూచుచుండగా "నీవు నేత్రరోగికి దీపమువోలె ప్రతికూలురాలవు" అని ఇట్లు

పరుషముగ మాటలాడెను. పతివ్రతయగు సీత తన భర్త పలికిన కఠోరవాక్కులు సహింపలేక అగ్నిప్రవేశము చేసెను.

**తతోఽగ్నివచనాత్ సీతాం జ్ఞాత్వా విగతకల్మషామ్,**
**బభౌ రామః సంప్రహృష్టః పూజితః సర్వదైవతైః. 82**

**ప్ర.** తతః = పిమ్మట, రామః = రాముడు, అగ్నివచనాత్ = అగ్నియొక్క మాటవలన, సీతామ్ = సీతను, విగతకల్మషామ్ = తొలగిన పాపము కల దానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, సంప్రహృష్టః = ఆనందించినవాడై, సర్వదైవతైః = సకలదేవతలచే, పూజితః = పూజింపబడినవాడై, బభౌ = ప్రకాశించెను.

**తా.** అట్లు సీత యగ్నిప్రవేశము చేసిన పిమ్మట, అగ్ని మాటచే సీత యే దోషమును లేని దని గుర్తించి, రాముడెంతో సంతసించినవాడై సర్వదేవత లాతని యా ధర్మనిరతిని ప్రశంసింపగా నెంతయు ప్రకాశించెను.

**కర్మణా తేన మహతా త్రైలోక్యం సచరాచరమ్,**
**సదేవర్షిగణం తుష్టం రాఘవస్య మహాత్మనః. 83**

**ప్ర.** మహాత్మనః = మహాస్వభావము కలవాడగు, రాఘవస్య = రామునియొక్క, మహతా = గొప్పదియగు, తేన కర్మణా = ఆ పనిచే, సచరాచరం = స్థావరజంగమసహితమైన, త్రైలోక్యం = మూడులోకములును, తుష్టమ్ = సంతోషించెను.

**తా.** మహాత్ముడగు నా రాముని ప్రశంసార్హమగు రావణవధచే స్థావరజంగమాత్మకములగు ముల్లోకములు, దేవతలు, ఋషులు ఎల్లరు ఆనందించిరి.

**అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్,**
**కృతకృత్య స్తదా రామో విజ్వరః ప్రముమోద హ. 84**

**ప్ర.** (రామః = రాముడు), లంకాయామ్ = లంకానగరమందు, రాక్షసేంద్రమ్ = రాక్షసరాజగు, విభీషణమ్ = విభీషణుని, అభిషిచ్య = పట్టాభిషేక మొనర్చి, తదా = అప్పుడు, కృతకృత్యః = చేయబడిన కర్తవ్యముకలవాడై, విజ్వరః = మనోవ్యథ తొలగి, రామః = రమణీయుడై, ప్రముమోద హ = ఆనందించెను.

**తా.** అంత నా రాముడు విభీషణుని లంకాపురిలో రాక్షసరాజుగ నభిషిక్తు నొనర్చుటచే తన ప్రతిజ్ఞ నెఱవేర్చుకొని, కృతకృత్యుడై, నాటి వఱకు, విభీషణునకు ప్రధానాభిలషితమైన కైంకర్యసామ్రాజ్య మెట్లును లభించినది కనుక లంకారాజ్య మంగీకరించునో లేదో, భరతునివలె నిరాకరించిన నా ప్రతిజ్ఞ నిలచుట యెట్లు? అను తన మనస్తాపము వీడి సంతసించెను.

**దేవతాభ్యో వరం ప్రాప్య సముత్థాప్య చ వానరాన్,**
**అయోధ్యాం ప్రస్థితో రామః పుష్పకేణ సుహృద్వృతః. 85**

**ప్ర.** రామః = రాముడు, దేవతాభ్యః = దేవతలనుండి, వరమ్ = వరమును, ప్రాప్య = పొంది, వానరాన్ = కోతులను, సముత్థాప్య = మేల్కొలిపి, పుష్పకేణ = పుష్పక విమానముతో, సుహృద్వృతః = మిత్రులతో పరివేష్టితుడై, అయోధ్యామ్ = అయోధ్యానగరమునుగూర్చి, ప్రస్థితః = బయలుదేరెను.

**తా.** యుద్ధమున తన విజయము గాంచి తన్ను ప్రశంసింప

వచ్చిన దేవతలు వరమీయగా, దాని ప్రభావముచే మృతులైన వానరులను నిద్రించిన వారినివలె మేల్కొలిపి, వెనుక కుబేరుని జయించి రావణుడు వశమొనర్చుకొనిన పుష్పకవిమానమున మిత్రులగు సుగ్రీవ, విభీషణాదులతో గూర్చుండి రాము డయోధ్యకు బయలుదేరెను.

**భరద్వాజాశ్రమం గత్వా రామః సత్యపరాక్రమః,**
**భరతస్యాంతికం రామో హనూమంతం వ్యసర్జయత్. 86**

**ప్ర.** సత్యపరాక్రమః = సత్యవిషయకమగు పరాక్రమముకల, రామః = రాముడు, భరద్వాజాశ్రమమ్ = భరద్వాజు నాశ్రమమును గూర్చి, గత్వా = వెడలినవాడై, రామః = రాముడు, హనూమంతమ్ = హనుమంతుని, భరతస్యాంతికం = భరతునివద్దకు, వ్యసర్జయత్ = పంపెను.

**తా.** సత్యవిషయక మగు పరాక్రమముతో నలరారు రాముడు భరతున కిచ్చిన వాగ్దానము ననుసరించి పదునాలుగవ సంవత్సరపు చివరి రోజున భరద్వాజాశ్రమమునకు వచ్చి, నా డచట నుండవలసి నదని భరద్వాజుడు కోరుటచే తన రాక భరతు డెఱుగనిచో మరునాడత డగ్నిప్రవేశ మొనరించునని వెంటనే హనుమంతుని భరతునికడకు పంపెను.

**పున రాఖ్యాయికాం జల్పన్ సుగ్రీవసహితశ్చ సః,**
**పుష్పకం తత్ సమారుహ్య నందిగ్రామం యయౌ తదా. 87**

**ప్ర.** సః = రాముడు, తత్ = ప్రసిద్ధమైన, పుష్పకమ్ = పుష్పక విమానమును, సమారుహ్య = ఎక్కి, సుగ్రీవసహితః = సుగ్రీవునితో

కూడినవాడై, పునః = మాటిమాటికి, ఆఖ్యాయికామ్ = పూర్వము గడచిన కథను, జల్పన్ = మాటలాడుచు, తదా = అప్పుడే, నందిగ్రామమ్ = నందిగ్రామమును గూర్చి, యయౌ = వెడలెను.

**తా.** అటనుండి సుగ్రీవ, విభీషణాదులతో కలసి వేగముగ పోవు పుష్పక మెక్కి మాటిమాటికి సీతకు, తక్కినవారికి వెనుకటి విశేషములు తెలియజేయుచు నప్పుడే భరతు డున్న నందిగ్రామమున కేగెను.

**నందిగ్రామే జటా హిత్వా భ్రాతృభిః సహితోఽనఘః,**
**రామ స్సీతా మనుప్రాప్య రాజ్యం పునరవాప్తవాన్. 88**

**ప్ర.** అనఘః = పాపరహితుడైన, రామః = రాముడు, నందిగ్రామే = నందిగ్రామమందు, జటాః = జడలను, హిత్వా = విడచి, భ్రాతృభిః = సోదరులతో, సహితః = కూడినవాడై, సీతాం = సీతను, అనుప్రాప్య = పొంది, పునః = తిరిగి, రాజ్యమ్ = రాజ్యమును, అవాప్తవాన్ = పొందెను.

**తా.** పాపరహితుడగు రాము డా నందిగ్రామమున సోదరులెల్లరిని కలిసికొనినవాడై, జడలను తీసివైచి, సీతాసమేతుడై పూర్వ మొకసారి తండ్రిచే దత్తమగు రాజ్యమును వనవాసానంతరము మఱల స్వీకరించెను.

**ప్రహృష్టో ముదితో లోక స్తుష్టః పుష్టః సుధార్మికః,**
**నిరామయో హ్యరోగశ్చ దుర్భిక్షభయవర్జితః. 89**

**ప్ర.** లోకః = జనులు, ప్రహృష్టః = పులకితులై, ముదితః =

ఆనందమునొంది, తుష్టః = ప్రీతులై, పుష్టః = పుష్టి నందినవారై, సుధార్మికః = మిగుల ధర్మాచరణశీలురై, నిరామయః = మనోవ్యథ లేనివారై, అరోగశ్చ = శారీరక రోగము లేనివారై, దుర్భిక్షభయవర్జితః = కరువుభయము తొలగినవారైరి.

**తా.** రాజుగా రాము నెప్పుడు చూతుమా యని ఎదురు చూచిన ప్రజలు పులకితగాత్రులై ఆనందము నొందిన మనస్సుతో, తమ కోర్కె లీడేరిన వన్న ప్రీతితో, నాటివఱకు రాము నెడబాసి కళదప్పి చిక్కిన శరీర మిపు డానందపూర్ణమై పరిపుష్టి నందగా, రామభక్తి పూర్వకమగు ధర్మాచరణతత్పరులై మనోవ్యథ కాని, శారీరకమగు వ్యాధికాని లేక, కఱవుభయ మొకింతయు లేనివారైరి.

యుద్ధకాండము సమాప్తము.

# ఉత్తరకాండము

**న పుత్రమరణం కించి ద్ద్రక్ష్యంతి పురుషాః క్వచిత్,**
**నార్య శ్చావిధవా నిత్యం భవిష్యంతి పతివ్రతాః. 90**

**ప్ర.** పురుషాః = జనులెవ్వరును, కించిత్ = ఎక్కడో ఒకచోనైనను పుత్రమరణమ్ = బిడ్డల చావును, న ద్రక్ష్యంతి = చూడరు, నార్యశ్చ = స్త్రీలును, అవిధవాః = విధవలుగాక, నిత్యమ్ = ఎల్లపుడు, పతివ్రతాః = పతివ్రతలు, భవిష్యంతి = కాగలరు.

**తా.** జను లెవ్వరును తమ కుమారులు మరణించగా తాము చూడరు. అట్లే స్త్రీ లెల్లరును సదా వైధవ్యము లేక పతివ్రతలై యుందురు.

**న చాగ్నిజం భయం కించి న్నాప్సు మజ్జంతి జంతవః,**
**న వాతజం భయం కించి న్నాపి జ్వరకృతం తథా. 91**

**ప్ర.** అగ్నిజమ్ = అగ్నివలనకలుగు, భయమ్ = భయము, కించిత్ = కొంచెమును, న = లేదు, జంతవః = ప్రాణులు, అప్సు = నీటియందు, న మజ్జంతి = మునుగుట లేదు, వాతజం భయమ్ = పెనుగాలివల్ల భయము, కించిత్ = కొంచెమును, న = లేదు, తథా = అట్లే, జ్వరకృతం = జ్వరమువల్ల కలిగిన, భయమ్ = భయము, న = లేదు.

**తా.** ఎవ్వరును అగ్నిలో పడిగాని, నీట మునిగి కాని మరణించరు. పెనుగాలి వచ్చునను భయముగాని జ్వరము వచ్చునను భయముకాని కలుగదు.

**న చాపి క్షుద్భయం తత్ర న తస్కరభయం తథా, 92**
**నగరాణి చ రాష్ట్రాణి ధనధాన్యయుతాని చ,**

**ప్ర.** తత్ర = అచ్చట, క్షుద్భయం = ఆకలివలన భయము, న చాపి = లేదు, తథా = అట్లే, తస్కరభయమ్ = దొంగలవలని భయము, న = లేదు, నగరాణి = పట్టణములు, రాష్ట్రాణి = పల్లెలును, ధనధాన్యయుతాని చ = ధనధాన్యములతో కూడియుండును. సర్వే = ఎల్లరును, యథా కృతయుగే తథా = కృతయుగమున వలె, నిత్యమ్ = ఎల్లపుడు, ప్రముదితాః = సంతుష్టులై యుందురు.

**తా.** ఎచటను ఆకలివలన భయము లేదా చోరులవలని భయము కలుగదు. పట్టణములు, పల్లెలు, ధనధాన్యసంపన్నములై యుండును. జనులెల్లరు కృతయుగమునవలె ఎల్లపుడు మిగుల పరితుష్టులై సంచరింతురు.

**నిత్యం ప్రముదితాః సర్వే యథా కృతయుగే తథా. 93**
**అశ్వమేధశతై రిష్ట్వా తథా బహుసువర్ణకైః,**
**గవాం కోట్యయుతం దత్త్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి,**
**అసంఖ్యేయం ధనం దత్త్వా బ్రాహ్మణేభ్యో మహాయశాః. 94**

**ప్ర.** మహాయశాః = గొప్పకీర్తిగల రాముడు, అశ్వమేధశతైః = వందలకొలది అశ్వమేధములచేతను, తథా = అట్లే, బహుసువర్ణకైః = బహు సువర్ణములను క్రతువులతోను, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణుల కొఱకు, గవాం = ఆవులయొక్క, కోట్యయుతమ్ = పదివేలకోట్లు, దత్త్వా = ఇచ్చి, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమునకు, ప్రయాస్యతి = పోగలడు.

**తా.** ఆ రాముడు వందలకొలది అశ్వమేధయాగములు, బహుసువర్ణయాగములను చేసి, అందు పదివేలకోట్ల గోవులను, అసంఖ్యాకమగు ధనమును బ్రాహ్మణుల కొసగి గొప్పకీర్తి నందగలడు.

**రాజవంశాన్ శతగుణాన్**
**స్థాపయిష్యతి రాఘవః,**
**చాతుర్వర్ణ్యం చ లోకేఽస్మిన్**
**స్వే స్వే ధర్మే నియోక్ష్యతి. 95**

**ప్ర.** రాఘవః = రాముడు, అస్మిన్ లోకే = ఈ లోకమున, శత గుణాన్ = నూరురెట్లుగా, రాజవంశాన్ = రాజవంశములను, స్థాపయిష్యతి = స్థాపించగలడు, చాతుర్వర్ణ్యమ్ = నాలుగు వర్ణములవారిని, స్వే స్వే = తమ తమ, ధర్మే = ధర్మమందు, నియోక్ష్యతి = నియమింప జేయగలడు.

**తా.** రాముడు ప్రతి రాజవంశీయునకును కొంత కొంత రాజ్యమిచ్చి, వందలకొలది రాజవంశములను వృద్ధినొందించగలడు. ఈ లోకమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రు లనెడి నాలుగు వర్ణముల వారిని తమ తమ ధర్మము నాచరింప జేయగలడు.

**దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ,**
**రామో రాజ్య ముపాసిత్వా బ్రహ్మలోకం ప్రయాస్యతి. 96**

**ప్ర.** రామః = రాముడు, దశవర్షసహస్రాణి = పదివేల సంవత్సరములు, దశవర్షశతాని చ = వేయి సంవత్సరములు (మొత్తము పదునొకండు వేల సంవత్సరములు) రాజ్యమ్ = రాజ్యమును, ఉపాసిత్వా = పాలించి, బ్రహ్మలోకమ్ = వైకుంఠమునకు, ప్రయాస్యతి = పోగలడు.

**తా.** పదునొకండువేల సంవత్సరములు రాముడు రాజ్యముచేసి వైకుంఠమున కేగగలడు.

**ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్,**
**యః పఠే ద్రామచరితం సర్వపాపైః ప్రముచ్యతే. 97**

**ప్ర.** ఇదమ్ = ఈ, పవిత్రమ్ = పవిత్రమును, పాపఘ్నమ్ = పాపములు తొలగించునదియు, పుణ్యమ్ = పుణ్యము కలిగించునదియు, వేదైః = వేదములతో, సమ్మితమ్ = సాటియైనదగు, రామచరితమ్ = రామచరిత్రను, యః = ఎవడు, పఠేత్ = చదువునో (వాడు), సర్వపాపైః = అన్నిపాపములచే, ప్రముచ్యతే = విడువబడును.

**తా.** పరిశుద్ధి కలిగించునది, పాపములు తొలగించునది, పుణ్యము గూర్చునది, వేదమువలె నిత్యము అధ్యయనము చేయదగినదగు నీ రామచరిత్ర మెవడు చదువునో అత డన్ని పాపములనుండియు విడువబడును.

**ఏత దాఖ్యాన మాయుష్యం పఠన్ రామాయణం నరః,**
**సపుత్రపౌత్రః సగణః ప్రేత్య స్వర్గే మహీయతే. 98**

**ప్ర.** ఆయుష్యమ్ = ఆయువును పెంపొందజేయున దగు, ఆఖ్యానమ్ = ఆఖ్యాయికా రూపమగు, ఏతత్ రామాయణమ్ = ఈ బాల రామాయణ మను రామచరిత్రను, పఠన్ = చదువుచున్నవాడై, నరః = మనుజుడు, సపుత్రపౌత్రః = కుమారులు మనుమలతో, సగణః = బంధువులతో, ప్రేత్య = (పునర్జన్మలేని) శరీరనాశము పొంది, స్వర్గే = పరమపదమున, మహీయతే = పూజితుడగును.

**తా.** ఆయువును పెంచు నీ (బాల) రామాయణకథను చదువువాడు, పుత్రపౌత్రులతో, తనవా రెల్లరితో, వర్ధిల్లి, తుదకు శాశ్వతముగ శరీరనాశము నంది పరమపదము జేరి పూజితుడగును.

**పఠన్ ద్విజో వాగృషభత్వ మీయాత్**
**స్యాత్ క్షత్రియో భూమిపతిత్వ మీయాత్,**
**వణిగ్జనః పణ్యఫలత్వ మీయాత్**
**జనశ్చ శూద్రోఽపి మహత్త్వమీయాత్. 99**

**ప్ర.** ఇదమ్ = ఈ బాలరామాయణమును, పఠన్ = చదువుచున్నవాడై, ద్విజః = బ్రాహ్మణుడు, వాగృషభత్వమ్ = వేదవేదాంగపారగత్వము, ఈయాత్ = పొందును, స్యాత్ క్షత్రియః = క్షత్రియుడగుచో, భూమిపతిత్వమ్ = భూపతియగుటను, ఈయాత్ = పొందును, వణిగ్జనః = వైశ్యుడు, పణ్యఫలత్వమ్ = క్రయవిక్రయార్హమగు వస్తులాభమును, ఈయాత్ = పొందును. శూద్రః అపి జనః = శూద్రుడును, మహత్త్వమ్ = శ్రేష్ఠతను, ఈయాత్ = పొందును.

**తా.** ఈ (బాల) రామాయణము చదువు బ్రాహ్మణునకు వేదవేదాంగపారగత్వమును, క్షత్రియునకు సామ్రాజ్యమును, వైశ్యునకు క్రయవిక్రయయోగ్యమగు వస్తులాభమును, శూద్రునకు గొప్పదనమును కలుగును.

**ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే బాలకాండే**
**శ్రీమద్రామాయణకథాసంక్షేపో నామ ప్రథమః సర్గః**

ఇట్లు ఋషిప్రోక్తము, ఆదికావ్యము అగు శ్రీమద్రామాయణమందు
బాలకాండమున శ్రీమద్రామాయణ కథాసంక్షేపము
(బాల రామాయణము, సంక్షేపరామాయణ మనియు పేర్లు)

అను ప్రథమసర్గ సంపూర్ణము

